# విధివిధానము

(మూడంకముల సాంఘిక నాటకము)

గ్రంథకర్త:

పి. టి. రామచంద్రనాయనింవారు

౧౯౪



స్వామ్యములు
కర్తవి

వెల
ఒక రూపాయి

"విధివిధానము"

రిపబ్లిక్ దినోత్సవసందర్భమున



**26-1-1950**

గురువారము

గ్రంథకర్త.

# ★ కృతిసమర్పణము ★

మిక్కిలి మక్కువతో నాకీ భౌతిక శరీరమునిచ్చి న
మలంకరించిన నా మాతృ దేవి యగు శ్రీ శ్రీ శ్రీ పాళేగా
ధూళి లక్ష్మమ్మగారి ఋణము చెల్లించుటకై వేరువిధాన
గానక భయభక్తులతో ఆమె పవిత్ర పాదపద్మముల కీ చి
పొత్తమును హృదయపూర్వకముగ సమర్పించుచున్నాడను.

నగరి
26–1–50

పి. టి. రామచంద్రనాయనింవా

# విజ్ఞప్తి

•••○○○•••

నా పిన్ననాటి నుండియు, నాట్యకళారాధనయం దెక్కుడభిమానము. తత్ఫలితముగ సంగీత సాహిత్యమందుకూడ కొంత యభిరుచి గల్పించుకొని, శ్రీ చిత్తూరు వి. నాగయ్యగారితో కలసి "శ్రీ రేణుకా ఫిలుమ్సు" ను, మద్రాసులో స్థాపించితిని. అందు దురదృష్టమే నావంతై అదృష్టము మరియొకరివంతైనది.

దైవ సంకల్పమున కెదురీదుట కెవరితరము. అతనిఇచ్ఛ నాచే మరేమి చేయింపవలెనని యూహాపోహ యని; కడకు, నాకీ కళపై నున్న ప్రేమచిహ్నముగ ఈచిన్న పాత్రమునైనను వ్రాసి, నా ఆంధ్రసోదర, సోదరీమణుల కర్పించి, తద్వారా నైనను తృప్తిపొందదలచి, ఈ ప్రయత్నమునకు గడంగితి. ఇయ్యది నాప్రథమ ప్రయత్న మగుడు, ఆంధ్రలోకము నా దోసగుల మన్నింపకపోదని ప్రబల విశ్వాసము కలిగి యున్నాడను.

నే నీ పుస్తకమును రచించునప్పుడు కాకతాళీయముగ, నాప్రియమిత్రులును "ఆదర్శము, నీతిప్రబోధి" కాది గ్రంథకర్తలైన శ్రీ పగడాల కృష్ణమూర్తి నాయుడుగారు, నారచననుజూచి నన్నాశీర్వదించి ముద్రింప ప్రోత్సహించిరి. కావున, వారికిని నన్ను నిరంతర మాకృషియందు లగ్నమొనరింపజేసి అనేక భావము లొసంగిన, నా శ్రేయోభిలాషియు, నా ఆప్తమిత్రు

లును, సముచితపరిజ్ఞానసౌశీలురు నగు నగర పంచాయితీబోర్డు ప్రెసిడెంటు శ్రీ శ్రీ ఆటుపాకం రాఘవమొదలి గారికిని, నా హృదయపూర్వక కృతజ్ఞత దెలుపుకొనుచున్నాను.

ఈ పుస్తకమునం దచ్చటచ్చట పాటలు, పద్యములు, అ-మాత్రము సూచించి యుంటిని. ఏలన ఆయా స్థలములం తమతమ వీలునుబట్టి మనోజ్ఞములగు పాటలనేమి, పద్యము నేమి, ఇమిడించుకొను స్వాతంత్ర్యము ప్రదర్శకులకు ఉం వలయు ననుటయే.

ఈ పుస్తకమును ముద్రింప, అడిగినతక్షణము తమకెన్ని పనులున్నను, వాని నావలకు ద్రోసి ముద్రించుట కంగీకరించిన శ్రీ శ్రీ శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారికిని వందనము లర్పించుచున్నాడను.

నగరి
26-1-1950

పి. టి. రామచంద్ర నాయనింవారు
రచయిత.

# పీఠిక

—000—

మా మిత్రులు శ్రీ పి. టి. రామచంద్ర నాయనింవారు రచించిన "విధి విధాన"మను పొత్తమును జూచితిని. ఈనాటకమునందు పాత్ర లొక్కొక్కరి నొక్కొక్క ఉద్దేశ్యముతో వారు సృష్టించి నటుల తోచెడిని. దేశ సౌభాగ్యమునకై ప్రస్తుత మిట్టి గ్రంథములు మిగుల అమూల్యములు. గ్రంథకర్త కేవలము చిన్నవయస్సు గలవారైనను, ఈనాటకములోని కొన్ని అపూర్వరంగము లెట్లు తన లిఖిణీకొనయం దిముడ్చగలిగిరో ఊహింపలేకుంటిని. ఈగ్రంథమునందలి కథానాయకుడగు రత్నం నిజముగా రత్నమే యగును. రత్నముయొక్క త్యాగము వేషధారులై (we are a single nation) "మనదొకటేజాతి" యని క్రియాశూన్యులై బూటకపుపలుకులు బలుకువారి కొక మాతిపెట్టు. కాంచన వినయము, చంద్రుని మిత్రత్వము, పల్లెటూరి భావములు, మంత్ర తంత్రాంగ తతంగములు, ఆరూఢాది విషయములు, కోర్టువ్యవహారములు, అవిఇవి యననేల - కావలసిన ముఖ్యములగు సాంఘిక ఘట్టములు చదువరుల కాహ్లాద మివ్వకపోవు.

ప్రప్రథమముననే కృతికర్త ఇట్టి గ్రంథమును వ్రాయగలిగినప్పుడు ఇక ఈతనిచే రచింప బడబోవు "వినోదమా, విషాదమా" అను విషాద భాగ్యపరివృతుండగు "దారా" సుచ

రిత్ర యింకను మనోజ్ఞముగ, నీతిదాయకముగ శోభాయమానముగ విలసిల్లకపోదని భావింతును.

సర్వేశ్వరుడు ఈగ్రంథకర్తచే ఇతోఽధిక గ్రంథముల పెక్కిటిని రచింపజేసి, తన్మూలముగ వీరిచే దేశసేవయు, భాషాసేవయు, సంఘసేవయు చేయ ననుగ్రహించు గావుత!

నగరి
26–1–50

పి. కృష్ణమూర్తి నాయుడు

## ఈ నాటకమున వచ్చు పాత్రలు

రత్నం — కథానాయకుడు
చంద్రు — కథాయకుని స్నేహితుడు
వెంకట్రావు — మణలూరు గ్రామాధికారి
రామయ్య
శేషయ్య
గంగాధరం గ్రామాధికారి స్నేహితులు
గోవిందయ్య
సుబ్బయ్య — గ్రామాధికారి సేద్యగాడు
వీరుడు — గారడీవాడు
భూపతిరావు బహదర్ — కొండపల్లి జమీందారు
రాముడు — జమీందారు సేవకుడు
రాఘవరావు — జీవన్ ప్రభాత్ కంపెనీ మేనేజరు
బ్రహ్మయ్య — రాఘవరావు స్నేహితుడు
మల్లికార్జునయ్య — కాంగ్రెసునాయకుడు

### స్త్రీలు

కాంచన — కథానాయకి
కమల, సుశీల, పార్వతి — కాంచన చెల్లెళ్లు
లక్ష్మి — గ్రామాధికారి భార్య
సుందరమ్మ — గ్రామాధికారి కూతురు
శకుంతల — జమీందారు కూతురు
కమలకుమారి — నటకురాలు

మరియు, మేజిస్ట్రేటు, సబ్ ఇన్స్పెక్టరు, పబ్లిక్ ప్రాసిక్యూటరు బ్యారిష్టరు; వకీల్లు, బంట్రోతులు, జవానులు, తపాలవాడు జోస్యుడు, రైతులు మొదలగువారు.

# 1 వ రంగము

ఊరు — మణలూరు

( వేళ :— గోధూళికా సమయము. స్థలము :— పడుదునా, ఉందునా అను గోడలతో, మిగుల వృద్ధాప్యదశలోనుండి ఏమహా మహుడైనా కాయకల్ప సిద్ధాంతముతో మరల పూర్వశోభ కలిగించునా యని, యవ్వనమంతా అవిశ్వాసమానవసేవకై విని యోగించి, నిరాధారిమై, వీధిలో బిక్కిరిచూపులు చూస్తూ నిలువబడిన యనదవలె ఉండే సత్రం.)

సమయము :— ఉరుము మెరుపులతో వర్షారంభము.

[ప్రవేశము :- వీరుడు, కాంచన, కమల, సుశీల, పార్వతి, శంకయ్య]

వీరుడు :— "అబ్బ" ఎట్లో సత్రంకడకువచ్చిచేరాము. ఇంకేం భయంలేదు — అంతయు మహేశ్వరి కృప. (తెరచియుంచబడిన తలుపును త్రోసి సత్రం లోపలిభాగమును చూచి) "కాంచనా" ఏమి దురదృష్టం — సత్రంగోడలన్నీ అక్కడక్కడ పడిపోయి పైకప్పంతా శిథిలమైయున్నదే. ఈశ్వరకృప మనకిచ్చుట కూడ శిథిలగృహమేనా దాపరించడం.

కాంచన :— (సత్రంలోనికివచ్చి పరీక్షిస్తూ) ఆఁ... పర్వా లేదు; ఈ జాగాకూడ దొరకకున్న ఈ వానలో ఏమైయుం దుమో గదా!

వీరుడు :— ఔను — అదీ నిజమే! ఇంతదూరం మూట ముల్లితోవచ్చి కాస్తవిశ్రాంతి తీసుకొనుటెంతో మేలే... ఆఁ...

బిడ్డ లందరు మధ్యాహ్నము నుంచి వస్తున్నారమ్మా.. పొయ్యి ముట్టించు...(అని కాంచనచేతికి అగ్గిపెట్టెనిచ్చును).

వీరుడు :— (బిడ్డలతో) నాయన్లారా ... ఇటురండు ... (కాంచన, బిడ్డలు పొయ్యివద్ద కూర్చుందురు)

వీరుడు :— అమ్మాయ్ — మీతల్లి చనిపోయి మూడు సంవత్సరము లైనది — నీ వెంత సామర్థ్యముతో ఈ కుటుంబ భారాన్ని మోయుచున్నా వమ్మా—లేకున్న ఈ బిడ్డలగతి ఏమై యుండేదో !

కాం :— నా ధర్మాన్ని నేను నెరవేరుస్తున్నాను. అం గదూ ; ఇంతకుమించి నా కింకేమికావాలి ?... నే లేకున్న గదా మీ కీ విచారం కలగాలి !

వీరుడు :— ఊ...ఎంతకాలం ఇలా ! రేపు నీకు పెండ్లైతే నీవు మాతోకూడ వుండడాని కౌనా అమ్మా ! నీభర్త, నీవు మీదారి మీరు చూచుకుంటారు.

కాం:— ఏంనాన్న ! మీరే అలా అంటున్నారూ...నా కెందుకూ పెండ్లి...

వీరుడు :— అలాకాదమ్మా ! యుక్తవయస్సులో పెండ్లి చేయవద్దా ! మనుమళ్ళు, మనుమరాళ్ళను చూచి నేనానందించ వద్దా ?

కాం:— (చిరునవ్వుతో) ఏం, నాన్న ! ఆమాట అనకండి ! నాకు దుఃఖమొస్తుంది (అంటూ ప్రక్కనయున్న బిడ్డలనుముద్దు పెట్టుకుంటూ). నా చిట్టిపాపలను విడిచిపోదునా !

వీరుడు :— ఇప్పు డాలాగే చెప్పెదవు! నీకు నచ్చిన పురుషు డొచ్చేసరికి మేమంతా జ్ఞాపక ముంటామా! ఊఁ, చూద్దాంలే. (స్వగతము) ఒక మంచిపిల్లవానిగా చూచి పెండ్లి చేయించి నాతోకూడా పెట్టుకుంటేబాగు; ఎందుకిప్పుడే ఈ ఆశ—ముందు యోచన ముప్పాకు చేటుగదా — (అని రెండునిమిషములు మౌన ముతో మోకాళ్ళను, రెండుచేతులతో కట్టుకొని కూర్చుండును.)

కాంచన :— న్నాన్నా . . . గంజి తయారైంది.

వీరుడు:— ఇదిగో (బిడ్డలనుచూచి) సుశీల, పార్వతి, ఇలా వరుసగా కూర్చోండి.

(అందరు వరుసగా కూర్చొని గంజిత్రావుదురు)

(చిరిగినగోనెలను పడుకగా పరుచుదురు. అందరు నిద్రింతురు).

(ప్రాతః కాలము — )

వీరుడు :— (నిద్రనుండి మేల్కొని, స్వగతము) "అఁ" ఎంతపొద్దెక్కింది - ఎంతగాఢనిద్ర! (సత్రమునుండి బయటికి వచ్చును.)

వీరుడు :— (స్వగతము) బిడ్డలింకను లేవలేదు! లేవుదునా? వలదుపాపము - నిన్నటి ప్రయాణపుబడలికవల్ల ఇంకను నిద్రించు చున్నారు — ఏమిలేకున్నా ఈనిద్రసుఖమైనా అనుభవించనీ— నిదానముగాలేస్తారులే . . . ఇంతలో మనంవచ్చినపని చూచు కుందాం—ఊరెలాఉందో వెళ్లిచూచుకుని! మనగారడీఆటకు గ్రామాధికారి ఉత్తర్వు పొందవలసియున్నది కదా — పోయివత్తును (అంటూబయలుదేరును) (తెరమూయబడును)

# 2 వ రంగము

స్థలము :- గ్రామాధికారిఇల్లు.

( తిన్నెపై రత్నం కాలుపైకాలువేసుకొని కూనిరాగము తీయుచుండు వీరుడు నోట్లోపల్లుపుల్లతో వచ్చి తిన్నెపైకూర్చునియున్న యువకునికి నమస్కరించును. )

వీరుడు :— మీరేనండీ, గ్రామాధికార్లు ?

రత్నం :— కాదు ! నేను వారికుమారుడను ; నాన్నగారు బయటకువెళ్ళినారు—నీకు వారితో కావలసినపని ఏమి ?

వీరుడు :— నాకాండి ! నాకు గారడీవిద్య తెలుసు. నిన్న సాయంత్రమే ఈఊరికొచ్చాను — సత్రంలోమకాంచేశాను-మీ ఉత్తరువైతే, ఈదినం నాకు తెలిసిన స్వల్పవిద్యలను చూపించి బహుమతులు పొంద ఆశిస్తున్నానండి (అని చేతులునొడుగుచూ, భయభక్తితో విన్నవించును.)

రత్నం :— ఆహా, దానికేమిలే ! నాన్నగార్కి ఒ చెపుతా. నాకూ చూడాలని చాలాసరదాఉంది — నీవిక మా ఇంటిముందరనే ఆరంభింపవచ్చును.

వీరుడు :— ఒకమనవి.

రత్నం :— ఏం...

వీ :— నేనీ ఊరికి క్రొత్తవాడను ! ఆట ఆడుటకు — సవుకుమానులో లేక పొదుగాటివెదురులో కావాలి... యుంటే ఇప్పుడే ఆట ఆరంభిస్తాను.

ర :— దానికేం! నీవు వెళ్ళి నీ సామానులు తెచ్చుకో, ఇంత లోగా నేనే కొయ్యలు తెప్పించి నాటించి సిద్ధంగా ఉంచుతాను.

వీరుడు:— (సంతోషముతో ఉప్పొంగి) మీకు దేవుడు తోడౌతాడండి – మీ సహాయం నేనెన్నడూ మరువను – ఇదిగో రెప్పపాటులో, నాసామాన్లతో వస్తున్నా. (అనివెడలును).

రత్నంనిష్క్రమించును ( తెరమూయబడును ).

# 3 వ రంగము

[స్థలము మణలూరుసత్రం - తండ్రిరాకకై అందరు ఎదురు చూచుచుందురు.]

బిడ్డలు :— నాన్నా, నాకేం తేచ్చేవ్ – నాకేం తెచ్చేవ్ ?

వీ :— నానాయన్లుకదు-ఇదో ఇకకొంతసేపటికి మీకు తిన డానికి తెస్తాలే తిందురుగాని.

కాం :— ఏంనాన్నగారూ! పోయివచ్చిన విశేషం చెప్పరేం!

వీ :—మనం ఈదినం సక్కమూతి చూచినామమ్మా! మహా రాజు! వయస్సులోచిన్నవాడైనా గుణములోపెద్దవాడు – మహారాజుగానుండని ; మహేశ్వరితోడుగా ఉండాలి – మంచి దయాళువమ్మా ఆగ్రామాధికారి కొడుకు - మనకేవిధమైన ప్రయాసలివ్వక అతనే కొయ్యలు మొదలగునవి నాటిస్తా నన్నాడు - ఇకలెండు - త్వరగాపోవాలి – వేళైంది (అంటూ మాటలతో వెళ్లుదురు).

( తెరమూయబడును)

# 4 వ రంగము

[స్థలము గ్రామాధికారి ఇంటిముందు—ఒకటి రెండు కొయ్యలు నాటబడియుండును. వెంకట్రావు - రామయ్య—శేషయ్య—గంగాధరం—తదితర గ్రామాధికారి స్నేహితులతో నిలుచుకొనియుండ సుబ్బయ్య తెచ్చిన మంచముపై కూర్చుందురు. రత్నం అతని స్నేహితుడు చంద్రు, తిన్నెపై కూర్చుని యుందురు - కాంచన, ఢమరమును, మెడకుకట్టుకొని వాయించుచుండును - ఊరి గుంపులు ఒకరివెనుక ఒకరువచ్చి చేరుదురు.]

వీరుడు :—(అందరకి నమస్కరించి గ్రామాధికారివద్దకు వెళ్ళి) ఉత్తర్విస్తారా.....

గ్రామాధికారి :—ఆహా! ఆరంభించు.

వీ :—(కొన్ని విద్యలు చూపి) :- మహాజనులారా ఇక మీద చేయబోవునది ఏమనగా (అంటూ గుంపువంక చూచుచూ. రత్నంకాంచన ఒకరినొకరు రెప్పవాల్చక చూచుచుండుట కనుగొని) ఇప్పుడునేను మీకుచూపింపబోవుచున్నది చాలవిచిత్రమైనది. అందరుదయచేసి చూడవలయునని ప్రార్థించుచున్నాను- (అని చెప్పుచుండగా, కాంచన, ఢమరమును వాయించుట కొంచెంఆపి రత్నంపైనే నిమగ్నమై, సిగ్గుతో చూచుచుండును. అక్కడ చేరియుండుగుంపు వీరిరువురిని గుర్తించి నవ్వుకొందురు. కొందరుయువకులు, వ్రేలుచూపి "చూడండ్రా వాళ్లిద్దరిని" అని ఒకరికొకరు, కనుసైగచేసుకొంటూ నవ్వుకొందురు.) వీరుడు

దీనిని, గమనించియు గమనింపనివానివలె నటించి, జనుల చూపును తనప్రక్కకు త్రిప్పుకొనుటకు కావలసిన కొన్ని ముఖ్యమైన విద్యలు చూపుసరికి, జనులు ఇంతకుముందు, జరిగిన దేమరచిపోయి "బేష్, బేష్ — సెబాష్, సెబాష్" అని కేకలు వేయుదురు. కొందరు "అరెరే" అపారమైనవిద్య! ఎట్లు చేస్తున్నాడో ఈ పనులు "ఆశ్చర్యం ఆశ్చర్యం" అనిఅందురు—కొందరు క్రిందవరచబడిన గుడ్డపై, నాణెములు గిరవాటువేయుదురు - వీరుడుగంభీరముగానిలిచి, అందరికీ నమస్కరిస్తూ గ్రామాధికారి వద్దకువెళ్ళి మాకుసెలవిచ్చెదరా......

గ్రామాధికారి :— (కూర్చున్నట్లే) ఒరే! నాయనా! రత్నం... ఇలారా...

రత్నం :— (తిన్నెనుండి దిగి) బలే బేష్ - సర్కస్ ఏం చేసేది, దీనిముందు (అంటూ తనమెడలోనున్న సరిగ వస్త్రమును వీరుని మెడకువేసి, జేబునుండి పదిరూపాయల నోటెత్తి వీరుని చేతికిచ్చును. కాంచన తనచూపు అందరికీ తెలిసిందేమోనని అనుమానముతో తలను క్రిందికివాల్చి రత్నాన్ని క్రీగంటి చూపులతో చూచుచుండును.)

గ్రామాధికారి :— (తనస్నేహితులతో) నా కుమారుడికి ఎప్పుడూ మెత్తనిహృదయ మండీ!

రామయ్య :— అందుకు సందేహమా, బి. ఏ., చదువుకున్నాడుగా - విద్య నేర్చినందుకు ఫలితము గుణమేకదండీ!

శేషయ్య :— ఇదేం ఆశ్చర్యం, తండ్రికి తగిన తనయుడు.

(ఇంతలో మూటలు కట్టుకుని 'వీరుడు, కాంచన' పోవు చుందురు. రత్నం కాంచనను దీనంతో చూచును. కాంచన కొంత దూరంపోయి, వెను దిరిగి రత్నాన్ని చూచివెళ్ళును దీనిని వీరుడు గమనించును.)

(తెరమూయబడును.)

## 5వ రంగము

స్థలము :— ఊరిబయట

[ప్రవేశం రత్నం]

రత్నం :— (స్వగతము) ప్రేయసీ! నీ క్రీగంటిచూపు నాహృదయతాపమును ఒక ప్యానుతో విసరినట్టయినదే! నేనెట్లు నిన్ను మరతును; Oh, No, ఐ కె నాట్ ఫర్ గెట్, యు. ఎన్ని ట్రబుల్సు అయినారాని, నిన్ను నాదాన్ని చేసికొనేతీరెదను. అయితే ఈ మా కూడికకు, సొసయిటీ ఒప్పుతుందా, లేదా అనేదే ఇప్పుడు కన్సిడరేషన్. పవిత్రహృదయాల వేదన తెలియని ఆ సొసయిటీతో నాకేమిపని? డేమ్ సొసయిటీ - కులం. కులం, అని అఘోరించడం ఎందుకు? మానవుడు వీలునుబట్టి ఎస్టాబ్లిష్ చేసుకొనిందేకదా కులం, దానితో పనిఏమి!

ఇకనిలిచినదేమి? అవుట్ వర్డ్ స్టేటస్, కల్ల—హోదా, రివ్వాని ఏగిరిపొయ్యే రిచ్చస్, యుంటే ఎంతటివానికైనా స్టేటస్ వస్తుంది

రెచ్చెడ్‌వరల్డ్, మానవునికి కావలసిందేమి! నిజముగా హృదయానందము, ఆ ఆనందము ల్యాండ్సువల్ల మనీవల్ల వస్తుందా? అది బూటకానందమేకాని లోలోన కుళ్ళి కుమిలి ఏడ్చే ఎందరి ధనాఢ్యుల మనము చూచుటలేదు. నిజమైన ఆనందముండి భిక్షమెత్తినా అదే ప్యారడైజ్, కల్లకపటమెరుగని ఆమె చూపుల లోని స్వీట్‌నెస్, ఆమె అవయవముల బ్యూటీ, ఆమె నడక లోని ఒబీడియన్స్, మరెక్కడైనా ఉందా! ఆమె నన్నెంతయినా అట్రాక్టు చేసింది — చేయగలిగిందీని — నిజముగా ఆమె గారిడీవేషధారిణి అయిన ఒక గాడెస్ - ప్రపంచము ఏమైనా, గ్రంబుల్ చేయనీ, నన్ను రిజకుచేయనీ! ఏమి చేయనీ, ఆమె నా హాఫ్‌హార్టు కాకుంటే నా జీవితఫలిత మేమి?

[ చంద్రు ప్రవేశించును ]

రత్నం :— రా...చంద్రూ! ఎక్కడా నీవు కనబడలేదే.

చంద్రు :— నేనూ నిన్నే వెదుక్కుంటూ వస్తున్నా! ఏదైనా విశేషమా...

రత్నం :— నీకు తెలియక ఏవిశేషము పోదుకదూ!

చంద్రు :— మరేం! నీలో హ్యాపీనెస్ ఏం కనబడలేదే!

రత్నం :— ఎలాకనబడును-ఈలోకంలో మనిషి తన ఇండిపెండెంట్ Views కూడ వెలిబుచ్చుటకు వీలులేకుండాఉన్నది.

చంద్రు :— అలాంటిట్రబుల్సు నీకేం లేవుగా!

రత్నం :— లేకేం! చంద్రూ! నిన్న గారడాట చూచావు కదూ?

చంద్రు :— చూచాను.

ర :— అందు మృదంగమువాయించినయువతిని చూచావా

చం :— ఆ! ఏదో చూచాను ; ఏమి ?

ర :— ఆ! ఆమె ఎట్లున్నదంటావు ?

చం :— ఆపె ఒక స్త్రీగా కనపడింది.

ర :— చాలులే ! ఎవరైనా నవ్విపోతారు ; ఆమె ఎం-
రూపవతో నీవు గమనించావా ?

చం :— ఊహు ; నాకేం అలా కనబడలేదు ; అదీగాక
నేను సరిగ్గా ఆమెను చూడనూలేదు — బాగుందేం ?

ర :— సరే — అయితే నీవద్ద ఏమిచెప్పి ఏం ప్రయోజనం

చం :— వెల్ ; డోంట్ బి డిజెక్టెడ్ ; కమ్ టు ది పాయింట్

ర :— చెప్పితే నీవేం చేయగలవు ?

చం :— ఏమిచేయగలనా ! ఏమిచేయలేను ? అనంగ తేమో
నాకు తెలిసినతర్వాత చూస్తావుగా !

ర :— ఏమియులేదు......అయితే...

చం :— అయితేనా! ఏం! నావద్దకూడా నీకు దాపరికమేనా

ర :— అనుమానం అనికాదు...చంద్రూ...చూడు,
కాస్టు సిస్టమ్ (Caste system) — ఈహెూదాలు — ఎవరు
సర్పాటు చేశారో గాని - లేకున్న ఎంత బాగుండేది !

చం :— వెల్ మై డియర్ రత్నం, నీ వాళ పెద్ద ఫిలాసఫీ
చాతున్నావే! ఉన్నట్లుండి అమాంతంగా ఈ కులవేదాంతము
... ... ... ...లింగోయిూ !

ర:— ఈ అబ్‌స్ట్రక్షన్సు (Obstructions) లేకుంటే ఎంత బాగుండేది - అప్పుడంతా రైట్ రాయల్ రోడ్ (Right Royal Road) - చెలో - మన ఇష్టము మేరకు చెలో - హృదయము కోరిన మేరకు స్వేచ్ఛగా ఎవరినైనా ప్రేమించి వివాహమాడి హాయిగా జీవించే ఫ్రీడం (Freedom) భూతల స్వర్గమంటావా! ఈ కట్టుదిట్టాలకు కులతత్వ బంధములకు చిక్కుకొని మనసుకు నచ్చని ఒళ మంకి బ్రాండును మన పెద్దలు ముడి వేస్తే మోస్టుహంబుల్ సర్వెంటు అని అనిపించుకొన వలెనని లోలోన ఏడ్చి పైకి లేనిసంతోషము లోకానికి చూపుట స్వర్గమంటావా! ఇందులో ఏది స్వర్గము - ఏది నరకము - చంద్రూ - నీవే చెప్పు......

చంద్రు:— ఆర్డర్, ఆర్డర్ ప్లీస్, రత్నం, ఏం ఈదినము ఒక టే లెచ్చరు కొట్టేస్తూన్నావు, ఎప్పుడులేని ఎమోషన్ (emotion) ఈ వేళేమిటోయి, నీపెండ్లివిషయము ఊరంతాపాకిపోతూంది, నీకేం, ప్రిన్సుఆఫ్‌వేల్సు (Prince of Wales) కొండపల్లి జమీందారు నీకు త్వరలో, ఫాదర్ ఇన్లా (Father- in-law) గను నీ వతనికి, సన్ ఇన్లా (Son–in–law) గను సంబంధము ఏర్పడబోతూఉన్నది. మీసిస్టరును ఆయనకే ఇచ్చే ఏర్పాటుకూడా జొతూయున్నదట, పాపము! ఆ పూర్ క్రీచరు– (Poor creature) ను ఆ ముసలి కొండముచ్చునకిచ్చి అంటగట్టారేమో! ఇంతకూ ఆమెఫేటు (fate) ఏమికానున్నదో, ఎవరికెరుక.

ర :— చంద్రూ! చూడు! నా చెల్లెలు అమాయకురా తనఇష్టము తలితండ్రులకు దెలిపే ధైర్యము ఆమెలోలేదు - దరిద్రపుగొట్టు సంఘములు పెరగటము ఈ పిరికిమందు ఆమె లెస్సగా పట్టుబడింది. మొగవారికే ధైర్యములేనప్పుడు ఆడువారిగతి ఏమి! ఈలాగు ఎన్ని జీవితాలు ఈ సొసైటీకి అయిపోయినాయోకదా! వరుడు మహారాజై తేనేమి, బీదవాడై తేనేమి - ఈ దినం మహారాజు, రేపుబీద - ఈ దినం బీ రేపు మహారాజు-ఇదే కాలచక్రసిద్ధాంతము. అదృష్ట మొకరి స్వంతమేకాదు. ఇట్లున్నప్పుడు, స్వచ్ఛమైన శాశ్వతమైన ప్రేమ పెద్దదా? లేక అశాశ్వతమైన ధనము గొప్పదా! నీవే చెప్పు సమ్మతములేని వివాహమును చేయించి, వాండ్ల జీవితమును పాడుచేయుట న్యాయమా? కలకాలము కష్టసుఖము లనుభ వించేది చేసుకున్నవారా? లేక చేయించినవారా? నే ప్రేమిం చిన స్త్రీ ఏ కులమైనాసరే, నాకా కులముతో పనిలేదు - నా ప్రేమే ముఖ్యం — నేనెన్నడు ఆత్మకు వంచకుణ్ణిగాను.

చం :—ఇప్పుడు నీవాగ్ధోరణి అర్థమైంది! నీవు విషయా వెలిబుచ్చక పోయినా నీమాటలే నాకన్నీ బోధపర్చాయి. ఆ...గారడీపిల్లను గురించియేకదూ ఇంత వ్యాఖ్యానము చే మన్నావు.

రత్నం :—ఆఁ...ఔను, నిజమే, ఇకనీముందు దాపరిక మ..

చం :—ఏం...రత్నం...ఆవిడ మంచివిగ్రహమేనా?

ర :—అందుకు సందేహమా! పదేనువేండ్ల పసిడిబొమ్మ- సృష్టికర్త తనచాతుర్యమంతాజూపి ఆమెను సృజించినట్లున్నది.

చం :—అలాగే కానిమ్ము - అయితే నీవు తలపెట్టుకొన్న అసాధ్యకార్యము దానిని సాధింప సాధ్యమా సాధ్యముకాదా అని యోచించవద్దూ! మీాఇంట్లో తెలిస్తే ప్రళయంపుట్టదూ!

ర :—తెలిస్తే ఏం? ఇది నాస్వంతవిషయం - నా హృదయమును అపహరించిన ఆ సుందరాంగిని మరచిపొమ్మంటావా? వలనుపడద్దు - ఏం...మన కులాంగనలకన్నా ఎన్నిరెట్లు ఆ నవ మల్లికా లతాకాంత మే లనుకున్నావు?

చం :—ఆఁ - ఆఁ - ఆగుము, ఆగుము. ఇక వర్ణింప నక్కర లేదు - నావరకూ సమ్మతమే...అయితే...కులం...గోత్రం అంతస్తూ? మీాహౌసులో ఒప్పుకొందురా? సొసయిటీ ఒప్పుకొనునా - అసలు మీాఫాదరీ విషయము వింటే రాద్ధాంత సిద్ధాంతాలై పోవూ!

రత్నం :—నిజమే; ఇలాంటి విషయాలను అనేకపెద్దలు ఖండించి యుండలేదా! మన కాలేజీలోజరిగిన మీాటింగులో కూడ వీనినిగూర్చి లెక్చర్లు వినియుండలేదా!

చం:—ఔను. నేనూ వినియున్నాను. కుల వ్యత్యాసములు పాటింపక పాణిగ్రహణ మహోత్సవము చేయించి, ఇండియా ఈస్ ఎ సింగిల్ నేషన్ బట్ నాట్ ఎ కంట్రీ ఆఫ్ డిఫరెంట్ క్యాస్ట్సు అండు క్రీడ్సు (India is a single nation, but not a Country of different castes and Cree-

ds) అనిపించ మహాత్మాగాంధీ, రాజా రామ్ మోహానరాయి, కందుకూరి వీరేశలింగము వంటి మహామహులు ఎంత ప్ర త్నించిరి. అయితే, సంఘము, ఇంకను దిద్దుపాటుకు రాలే సంఘము కూడ ఒప్పుకోనవలసిన పనిలేదనుకుంటూ, ఇది ఒ ప్రక్కవుండ, ఈ ఊరు ఒక పట్టణంగాకపోవె; ఇవని గుర్తించుటకు. మనగ్రామ మేలాంటిదిరా అంటే ఈలారేట ఒకటిదొరికితే చాలు, అన్నివనులు ఒకే మూలద్రోసి, చరిత్ర విమర్శనల డిస్కస్ (Discuss) చేస్తూ, డే అండ్ నై (Day and night) కాలక్షేపము చేస్తారు.

చంద్రు :— (పద్యం చెప్పిన పిదప)

చం :— ఈ అడ్డంకులంతా గమనించేనా ఈలా మాట్లా తున్నావు మరి, రత్నం?

రత్నం :— నేను ఇవన్నీ మైండు (mind) చేయవ పనీలేదు నీవు నాకుగాను, ఫీల్ (feel) చేయువలసిన నిమిత్తం లేదు. నాదారిన నేను పొయ్యేతీరుతాను.

చం :— అప్పుడూ ... నీ మనస్సు ఆవిడ పైనే లీన పోయిందా?

రత్నం :— ఔను!

చం : — ఇలాంటి నీ తీర్మానానికి కారణం?

ర :— ఇంకా కారణాలా – ఆమెలోయుండే స్వా సౌందర్యం నన్నాలాచేసింది. ముం దెట్టినకాలును వెనుకకు

వేయుటకు వీలులేదు. నేను ఆ సౌందర్య పిపాసా బద్ధుడనై తినో - పూర్వజన్మసంఘటిత ఆకర్షణా యుతుడనై తినో — భగవంతుని సంకల్ప సమస్యా వినోద పాత్రుడనై తినో నాకు తెలియదు. ఇందుచే సంఘమునకు వైరినైనను సరే, కన్నవాళ్ళకు కానివాడైనను సరే — నన్ను మా యింట్లోనుంచి వెళ్ళగొట్టినా సరే — నే నేమాత్రం వెనుకంజ వేయను.

చం :— డోంట్ బి హేస్టీ మై డియర్ ఫ్రెండ్ (Dont be hasty my dear friend) ప్రతివిషయాన్ని సావధానముగా పరిశీలించియే ఒక దృఢ నిశ్చయానికి రావలయును — హేవ్ పేషెన్స్ (Have patience).

రత్నం :— ఎందులో పేషెన్స్ చూపించాలనో అందులో నే గాని, ఈవిషయంలో కూడానా, "డిలే ఈస్ డేంజరస్" అని నీకు తెలియదూ!

చం :— నీవంత హేస్టీ (Hasty) పడడం నా కేమీ సమ్మతి పడుటలేదు ... (కొంతసేపు యోచించి) ఒక ఉపాయముచేద్దాం ... ఇలాంటి సమయములోనే తెలివి ఉపయోగించాలి.

ర :— ఏం ఉపాయం — మాతండ్రి మనస్సును గాని త్రిప్పినట్లయితే ఏ ఇబ్బందీ ఉండేదికాదు.

చం :— అది సాధ్యమా—బాగా థింక్ (Think) చెయ్యి.

ర :— ఈబుర్రకు ... తగుపాటి ఆలోచన అందలేదురా, ఉండూ...ఆ, ఆ...నా కొక మంచి యోచన జ్ఞప్తికి వచ్చింది.

చం :— అదేమిట్రా ?

ర :— మనం కాలేజిలో చదువుతున్నప్పుడు ఓ ఆదివా శ్రీ బంకిం బెనర్జిగారు, ఇంటర్ క్యాస్టు (Inter caste) వి వాహాన్ని గురించి సరైన లెక్చరిచ్చారే, నీకు జ్ఞాపకముందా !

చం :— అదేమిట్రా అలా అంటున్నావు ? వాటిని నేను కరతలామలకంగా పాఠంచేసి నీకెన్నోసార్లు ఒప్పగించినానే !

ర :— అందుకే, నాతండ్రిమనసు తిప్పేటందుకు ఇదొకటే మంచిమార్గం.

చం :— ఈ లెక్చర్ మూలంగానా ?

ర :— ఔను, ఏం...ఆలెక్చర్ విన్నప్పుడు మన కాలేజి అఖండమయిన మాబ్ (Mob) అట్టే ఆ సబ్ జెక్టు(Subject) లో లీనమైపోలేదు. ఇతనుమాత్రం ఏం, ఇతనూ మనిషేగా ; నీవు సామర్థ్యంగా మంచి సమయం చూసి ఈ లెక్చర్ ఏకరవెట్ట వంటే ఒకవేళ నానాన్న మనసు మారినా మారచ్చు — వుయ్ షల్ ట్రై — ట్రయిల్ కాస్ట్ నథింగ్. (We shall try–tri cost nothing)

చం :— ఈ ప్రయత్నాలవల్ల నాకేమీా నమ్మకంలేదు కాదంటే నీకు నాపై అతృప్తి — నే నేంజేయను — సరే — ప్రయత్నం నేను సిన్సియరు (Sincere) గా చేస్తాను—ఈ రో మీా తాతగారి సెరమనీ (Ceremony) కదూ — రామయ్య తదితర ప్రభృతులు భోజనానికి చేరుదురు — భోజన సమయ

అందరి మనస్సు సంతోషంగా ఉంటుంది. అక్కడ నామాట విప్పుతా.

ర :— తప్పకుండా చేయాలిసుమా, మరవకు.

చం :— ఊఁ, తప్పకుండా ట్రై చేస్తాలే, మరి ఇంకేమి, పోదాంరా.

ర :— నేనిప్పుడు ఇంటికొస్తే వెంటనే భోంచేసివెళ్ళిపోతా; నీవే అన్నీ సమర్థించుకోవాలి.

చం :— ఏం?

ర :— నేనుంటే, నేనే నిన్ను ప్రోత్సాహంచేసి మాట్లాడించి నట్టు మానాన్న డవుట్ (Doubt) పడచ్చు — ఈలాంటి సందేహాలకు ఇప్పుడు దారివ్వకూడదు—నీవే మాటల్లో మాట కలిపేసి ఒకదారికి తే.

చం :— (ఆలోచిస్తూ) ఊఁ...నాపై తిరుగబడు నేమో మాతండ్రి.

ర :— ఊహూఁ... అలాంటిది ఏమీజరగదులే, ధైర్యంగా ఉండు.

చం :— కానీ; స్నేహిత వాత్సల్యాన్నిబట్టి నే నేదైనా చేసి తీరాలి — చూద్దాం — వెడదాం రా.

(చంద్రూ రత్నం వెళ్ళుదురు.)

తెర మూయబడును.

# 6 వ రంగము

[ స్థలము :— మణలూరు సత్రం — వీరుడు, కాంచన, బిడ్డలు ]

వీరుడు :— ( స్వగతము ) గ్రామాధికారి కొడుకున్ను కాంచనయున్ను ఒకరినొకరు చూచుకొన్నందులో ఎంతో అర్థముంది. మిణుగరే, మంటలై మనము ఆర్పడానికి వీలు లేక పోవచ్చు. ఈ మోహాబ్ధిలో చిక్కిన ఏ పురుషుడుగాని, స్త్రీగా తప్పుకొను టరుదు. ప్రేమ గుడ్డిది అనేది అసత్యమా ! నాకూతురు కాంచన మంచి అందకత్తే, మంచిగుణాలు కలదే, గ్రామాధికారి కుమారునికి కాంచన అన్ని విధాలా తగినభార్యే — కాని— కులం ? అంతస్తూ ? అడ్డముకదూ ! నావెర్రికాకుంటే — పురుషు యొక్క స్వభావములో నాకెన్నడూ నమ్మకంలేదు.

మోసపరులైన యువకుల చేజిక్కిన యువతులగతి నేనెరుగుదును. ఎంత మంచివారు అయినా క్రొత్త ఒకవింతా పాత ఒక రోతా అన్నట్లు కొంతకాలానంతరము ! ఛీ ! నే నేమిపని చేసినాను — ఇది గారడీవాని కూతురేగదా అని అతృప్తిగలుగు సహజమేకదూ ! పురుషునికొక న్యాయం — స్త్రీకొక న్యాయ చెప్పేసంఘం కళ్లకు ఇది న్యాయమైనట్లు చెప్పునా !

ఈ మొక్కను లేతగా నున్నప్పుడే గిల్లివేయుట యుక్తము. ఇది మొదట కాంచనకు దుఃఖంగా ఏర్పడినను, తర్వాత మరపోవచ్చు. లోకజ్ఞానము బొత్తిగా ఎరుగని నా ముద్దులకుమార్తెను, వచ్చే అవమానముకు బలి యిచ్చుటకు, నామన స్సం-

మాత్రము ఒప్పుటలేదు. (అని అనుకొంటూ, ఒకమూల ఏదో ఆలోచిస్తూ కూర్చున్న కూతురిని పిలిచి) కాంచనా! నువ్వు ఈ దినమంతా ఒకతరహాగా నున్నావు. నీమనస్సు మనసులోలేదు. నీ వాలకమంతా చూస్తే పిచ్చిదాన వైపోతావేమో అని అని పిస్తుంది — అందులకు కారణంకూడా నాకు తెలును — ఐతే... నీవు చిన్నదానవు! లోక అనుభవం తక్కున — నీ విటువంటి విషయాల్లో మనసురించుట మన కర్తవ్యత కాదు.

కాంచన :— (కొంతసేపు సిగ్గుతో మౌనం వహించి) అలాంటిది ఏంలేదు నాన్న......ఆ......మీ......మీకు బహుమానా లిచ్చేరే; ఆత నెవరో మీ రెరుగుదురా......

వీ :— (నిట్టూర్పు విడుస్తూ) ఊఁ......ఎరుగుదును — ఆఁ...అతనేగా గ్రామాధికారి కొడుకు...ఆఁ...వానిలో మన కేంపనీ?

కాం :— ఎంత దయాళుడండీ! ఆయనేగా ఉదయంకూడా మనగ్గా కొయ్యలు తానే తెప్పించి నాటించి సహాయపడడం — (అంటూ సిగ్గుతో తల క్రిందికి వాల్చును)

వీ :— ఆ......ఔను......దానికేం!

కాం :— అలాకాదునాన్న...మనకీగ్రామములో ఆయన తప్ప ఎవరంత పోత్సహించారు —

వీ :— ఆఁ ... ఇంతకే ఒకవ్యక్తియొక్క గుణాతిశయ ములు మంచివని నిర్ధారణకు రాకూడదు...అమ్మాయ్...ఈ లోకం చాలచెడ్డది...నీవు పొరబాటు పడుచున్నావు......నీ

మంచికి చెప్పుతున్నాను—అతన్ని మరిచిపో—నామాటవిను..
ఆ......మరచేపోయాను......రేపు తెల్లవారియే, మన బయల్దేరి పోవాలి – ఇక్కడ్నే యుంటే ఎలా – మన కడుపార్థం చూసుకోవద్దా!

కాం :— ఇంతలోగానా! మన మొచ్చి ఒకరోజు కూ.. పూర్తికాలేదే – ఇంకా మన మొకవార ముంటేకూడ ఈఊళ్లో భత్యానికేమీ కొదువలేదే!

వీ :— ఆఁ...... మరేమీలేదు – ఈ ఊరి సాంగత్యా- నాకు పట్టిందికాదు......నేనన్నియు ఈ లోకంలో అనుభ చినవాడను ... ఇంకొకక్షణమాత్రమైనా నిలుచుటకు వీల్లేదు. ఇదిగో నేను అంగడివీధికి వెళ్ళి సామానులు తీసుకొస్తాను..... ఇంతలో నీవు కొంత అన్నం తయారు చేయువమ్మా ... పో

కాం :— మీయిష్టం (అంటూ నీరునిండిన కళ్ళను చీరల తుడుచుకుంటూ పోవును)

వీ :—కాంచనా! ఇల్లారా. (కూతురుని చేరదీసి) అమ్మాయ్- చింతింపకుము! కపటమెరుగని నీకన్నీరు నా మనస్సునకు బాధ కలిగించుచున్నది. నా అమ్మకదూ...నా మాటవిను – నేను తండ్రికదూ...అన్నీ నీ మంచికొరకే చెప్పు తున్నాను.. శీఘ్రంలో నీకు తగిన వరుణ్ణి చూచి...

కాం :— చెల్లే నాన్న...మీరు బజారుకు వెళ్ళిరండి.

(వీరుడుకొంతసేవు కదలక నిలుచుండి తర్వాత ఒక గో- ఎత్తుకొని చింతతో వెళ్ళును. కాంచన నిష్క్రమించును.

(తెర మూయబడును.)

# 7 వ రంగము

[ స్థలము:— కాళికాదేవిగుడి — రత్నం గుడివద్ద చంద్రునికై వేచియుండును.]

రత్నం:— (స్వగతము) అప్పుడే వస్తానన్నాడే — ఏం ఇంత కాలస్యం — ఊ......(అంటూ అటు ఇటు తిరుగుచుండును.)

[ చంద్రు ప్రవేశించును ]

ర:— హాలో — మైడియర్ చందర్, ఐ హోప్ యు ఆర్ క్వయట్ సక్సెస్‌ఫుల్ (Hullo, my dear Chander I hope you are quite successful). ఏమింతఆలస్యం; నేనింటినుంచి బయటికి వచ్చునప్పుడు ఏదో సందడిగా ఉండింది... ఈసమయంలో నేనక్కడ ఉండకూడదని వచ్చేశాను — లెక్చరేమైన ఆరంభించావా ?

చం:— (తెల్లబోతూ) ఆ, ఆరంభించినా ! నా పప్పులేమీ ఉడకలేదు.

ర:— (ఆతురంతో) ఆఁ...అలాగా ! అయితే ఏమి జరిగిందో చెప్పు...త్వరగాచెప్పవూ ?

చం:— చెప్పేదేముందీ...ఈ —

ర:— చంద్రూ ! చెప్పవేం !

చం:— చెబుతా, విను...అందరం భోజనానికి కూర్చున్నాం...మీతండ్రి వైఖరినాకు తెలిసే ఉందిగా... అంచేత నాకు కొంతధైర్యం వెనకాడి నాలుక కొన కొచ్చిన మాట

మళ్ళీ వెనక్కు రిటర్న్ (return) అయిపోతూఉండేది. ఈలా కొంతసేపు శ్రమపడి... పెరుగన్నంజుర్రే వేళ – ఇక టైము మించి పోతూందని తెగించి తిన్నగా లెక్చరు ఆరంభించాను –(introduction) ఇంటర్ డక్షన్ అనంతరము ఈ విషయమై రెండు సెంటెన్సులు (sentences) చెప్పాను. ఇంతలో నా గ్రహచారము చాలక నానోట్నుంచి నాలుగు ఇంగ్లీషుముక్కలు దొర్లాయి. అంతే–ఇంకేముంది నీతండ్రి కళ్ళెఱ్ఱచేసి, ఈ వెధవ ఇంగిలీసు చదువువల్ల మంచి బ్రాహ్మణ్యంకూడా చెడిపోతుంది దేవభాషలాగ భోజనాలదగ్గరకూడా ఈమాటలే కూస్తారు' ఆచారం గీచారంఅంతా తగలబడిపోతూంది, ఈ కిరస్తానీముండా కొడుకులవల్ల - అని గట్టిగా కేకలువేసేనరికి ఇక నాకు లెక్చరు పిగులుతుందా? లేక అన్నమేమైన దిగుతుందా? అంతమందిలో అంత డిస్గ్రేస్ (disgrace) అయిన తర్వాత అచ్చటుండడ మంచిదికాదని మెల్లగా లేచి వీధితిన్నె చేరువేళకు, రామయ్యా వాళ్ళంతా మీ తండ్రితో చేరుకొని కుక్కలు మొరిగినట్లు మొరగడం ప్రారంభించారు. అబ్బా...రత్నం, మీతండ్రి మన వంటి మనిషేకదా, ఒకవేళ మనసు మారొచ్చని తలచాను ఇదిగో ఇప్పుడు చెబుతున్నాను... మీతండ్రిని త్రిప్పటానికి బ్రహ్మ దేవునికి కాదు. వాండ్ల గ్రేట్ గ్రేండ్ ఫాదర్ (great grand Father) కు కూడ శక్యముకాదు–రవీంద్రునివంటి కవులేమి బిసెంటువంటి లెక్చరర్సేమి! వివేకానందునివంటి సన్యాసులేమి! ఇంతేల - మానవమాత్రు లెవరూ వచ్చి మీతండ్రికి చెప్పినా

కూడా మీతండ్రి వినేవాడు కాదు — నే నప్పుడే చెప్పేనుగా, పల్లెటూరిలో ఇటువంటి లెక్చర్లు పనికిరావని — నువ్వువింటేగా— ఇంతమాత్రం ఒక వ్యక్తి త్యాగం చెయ్యడానికి నిలబడి ఒక సిటీలో ఈలెక్చర్ ఇచ్చినట్లైతే — వీటికి వినేదానికి కనీసం వన్ ల్యాక్ పీపులైనా వస్తారు — ఏమీలేదూ, మన గ్రామంలో ఒక మీటింగ్ కావాలంటేకూడ (Tom Tom) వేయించినా, నోటీసులు డిస్ట్రిబ్యూట్ చేయించినా, బజారువెంబడి పొయ్యేవాళ్ళను యీడ్చుకొచ్చినా ఏపదిమందిగాని రారు.

రత్నం :— వాస్తవమే గాని ఏంచెయ్యడం? ఇక ఉపాయమేమీ లేదంటావా?

చంద్రు :— తరువాత కథ విను. నీ తండ్రి నా మీద కేకలు వేసినతరువాత పెరుగన్నంతో యుద్ధంచేయడం ప్రారంభించాడు-ఇంతలో నీచెల్లి తలుపుదగ్గరకువచ్చి తలుపైప ఒయ్యారంగా ఆనుకొని "కోకిల కంఠంతో, నాన్నా అన్న కీనెల్లో పెళ్ళి చేస్తారా" అని నోరుతెరచిన పాపమే—దానితో నీతండ్రికి వెఱ్ఱి కోపంవచ్చి, ఆ పెరుగన్నంతో విస్తర తీసికెళ్ళి ఆమెనెత్తిన రుద్దేకాడు—నేనడ్డుపడబోతే చెంబుతో నీళ్ళు నానెత్తిన పోనేకాడు. ఇక నాకేంపని-బాల్యంనుంచి మీఅందరితోనూ స్నేహం చేసి నందువల్ల ఏమిచేయుటకుతోచక ఇంటికి వచ్చేశాను! రత్నం! నీ సిష్టరు ఫేట్ (Fate) ను గురించి తలిస్తేనే నాకు చాలబాధ కలుగుతూ వుంటుంది. ఎవడో ఒక ముసలి జమీందారట నీకు తెలుసుగా, వాడికి మీసిష్టరుని ఇచ్చి పెండ్లచేస్తారటనే. ఓగాడ్!

హౌ రెచ్చడ్ ఇట్ ఈస్(Oh God how wretched it
ఆ ముసలి ముండాకొడుక్కి, ఆవిడ జీవితాన్ని మీ తం
అమ్మేస్తాడు కాబోలు — ఎంత అన్యాయం — నేనే నీ స్థానంల
ఉంటే ఏమైఉండేదో - మరలా నామనస్సుండక మీ సిష్ట
ఏమైందో చూద్దామని తిరిగి మీఇంటికి పోయాను. — వె..
చూస్తే మీయమ్మ ఏడుస్తూ ఒక మూల కూర్చుంది
నేను తిన్నగా, తిన్నెపై పరచిన చాపపై కూర్చున్నా — ఒక
సిగరెట్టుతీసి ముట్టించాను—అంతే తటాలున మీతండ్రి కోర
దయ్యములా బయటకువచ్చి, ఆతిన్నెమీదనే బిచాణవేసి, సి..
రేటును కాల్చనివ్వకుండా రెండుగంటలసేపు కబుర్లలో పె..
చంపేశాడు.

రత్నం:— సరే ఇక జరగడం ఎలా!

చంద్రు:— ఇదిగో ఇక్కడ వేంచేసియుండు గ్రామదేవత
యైన జగన్మాతయే నీకోర్కెను, నాకోర్కెను ఈడేర్చాలి. ఈమె
తప్ప మనకు వేరుదిక్కులేదు.

రత్నం:— (నవ్వుతూ) నీకోరిక ఏమిట్రా?

చంద్రు:— నాకేముంటుంది - బీదవాడికి మనోరాజ్యం
చేయనుకూడా హక్కులేదేమోగా!

రత్నం:— చంద్రూ! నాపైనెందుకు కోపపడతావు?
విషయం నాకుతెలుసు, నీకున్న అదేకోరిక ఐతే-మానాన్న..
ధనమే ప్రధానం కావున, ముసలో ముతకనో ఎవరంటేను
అతనికి దానితో పనిలేదు. ఆ అమాయకురాలైన నాచెల్లెను

నాకంస్లైదుటనే ఆమె జీవితాన్ని వంకలో కలువ ప్రయిత్నిస్తాడు - ఇందుకు నేను సమ్మతింపను. కానీ చూద్దాం! గుడి వైపుకు తిరిగి "లోకైక మాతా! నామనస్సులోని కోరిక తప్పా, ఒప్పా యని నీవుకూడా ఎరుగవా? నీదృష్టిలో కూడనా హెచ్చు తక్కువలు. అన్నిటికి, నిన్నే నమ్మినాను-నీవే నాకు తోడు, నీడ. శ్రీ పరమేశ్వరీ, శంకరీ, దయాపరీ, మావాండ్ల మనసును మార్చవా; నాపై కరుణించవా; నాకోర్కె లీడేర్చవా?"

రత్నం:— పాట:

చంద్రు:— రత్నం! ఇలారా, ఒక్కవిషయం.

రత్నం:— ఒక్కటి కాదు ఒక వంద చెప్పు వింటాను,

(ఇంతలో వీరుడు అంగడికిపోవుచూ వీరి కెదురుపడును.)

చంద్రు:— రత్నం! అదిగో మీవాడు పోతున్నాడు.

(వీరుడు రత్నాన్ని ఉరిమి చూస్తూ పోవును.)

చంద్రు:— ఏంరా! మీవా డేమో అంత ప్రేమగా నిన్ను చూస్తూ వెళ్లుతున్నాడే!

రత్నం:— ఊ ...... ఇదే మంచి సమయం - చంద్రూ! నీవింటికెళ్లు. నేను ఫైవ్ మినిట్సు (five minutes)లో తిరిగి వస్తాను.

చంద్రు:— ఏం?

రత్నం:— ఇప్పుడు చెప్పను — ఒక మంచి ఉపాయము దొరికింది — నీకు తర్వాత చెబుతా. ఆలస్యమవుతుంది. నీవెళ్లు,

చంద్రు :— అల్లాగా! తొందరపడి ఉపాయం అపాయ- మారకుండా చూచుకో.

రత్నం :— అలా ఏమీ జరుగదు — నీవు నెమ్మదిగా వెళ్ళ. నే శీఘ్రంలో నిన్ను కలుసుకొంటా.

చంద్రు :— ఆల్‌రైట్, మే గాడ్ బ్లెస్ యు. ఐ విష్ యు సక్సెస్ (Alright 'May Gob bless you' I wish you success).

(రత్నం వెళ్ళును)

(చంద్రు ఒకమూల నిలుచుకొని ఆలోచిస్తూ వుండును. త్రోవన శేషయ్య తలకు ముసుగు వేసుకొని చేతిలో ఒక ... యెత్తుకొని పోవుచుండును.)

చంద్రు :— ఎవరది ?

శేషయ్య :— (తిరిగిచూచి (తనలో) చచ్చాన్రా బాబు— నాగుట్టు బయటపడుతుంది.)అనుకుంటూ మెల్లగ జారిపోబోవును.

చంద్రు :— తరుముకొని పోవుచు — ఏయ్ ఆగు, ఆగు పిలుస్తావుంటే వెళ్తావేం ?

శేషయ్య :— ( తనలో ) వీడిసిగతరగా, తరుముకొంటు వస్తాడు కాబోలు—సిగపాయితీసి తందునుగాని, ఇది సమయం కాదు — అయితే గుట్టు తెలిస్తే తంతాడు కాబోలు — ఎక్కడ చిక్కడ్డాను — ఇక ఈకిరస్తానం ముండాకొడుకు నన్ను బం... పెడతాడు కాబోలు్రా దైవమా !

చంద్రు :— ( ముందుకొచ్చి శేషయ్య ముఖాన్ని చూచి ) ఎవరండీ ? మీరా మహానుభావులు !

శేషయ్యా :— ఔను. నేను శేషయ్యనురా అబ్బాయీ!

చంద్రు :— చేతిలో ఏమిటి?

శే :— అది మందురా బాబు.

చం :— ఇలా ఇవ్వండి చూదాం!

శే :— (తనలో, ఓరీ ముండాకొడకా, నీ కేంచేటుకాలం వచ్చిందిరా అని అనుకొంటూ) ఆ...ఆ...ఎందుకు? ఎందుకు? అదినీవు చూడవలసినది కాదురా అబ్బాయి. అది కాలకూట విషము.

చం :— విషమైతేఏం, నేనేం మింగేస్తానా — ఈలాతే చూద్దాంగాని (అని చేతినుండి లాక్కొని వాసనచూచి) "ఓ ఇదా సంగతి. ఇలా సారాయి" (అనేటప్పటికి శేషయ్యా చంద్రునోటిని తనచేత్తోమూస్తూ, గడగడ వణకుచు) "అబ్బాయి, నన్ను కాపాడానాయనా! నన్ను బయటపెట్టకురా తండ్రీ! ఇవి చేతులుకాను, పాదాలు అనుకో" (అని ప్రతిమాలును).

చం :— మనిషిలో పెద్దమనిషి — కులంలో గొప్పకులం— అంతస్తులో పెద్దఅంతస్తు — చదువులో పండితుడు కదూ నీవు?

శే :— లేదురానాయనా "నాకు కడుపునొప్పిరా" అంచేత ఈఔషధమును సేవించుచున్నానురా. నీకు వెయ్యి దండాలు పెడతారా, నన్ను బయట పెట్టకురా తండ్రీ!

చం :— నే నిప్పుడే కానిస్టేబులిని పిలవనా?

శే :— వలదురా తండ్రీ! వచ్చేజన్మలో నీ కడుపులో పుడతాను, నన్ను విడిచిపెట్టు. నీకు పుణ్యం ఉంటుంది.

చం :— ఓహూఁ! వచ్చేజన్మలో నాకడుపులో పు-
డుకు ఇప్పుడున్నంచే నన్ను "తండ్రీ" అని పిలుచుటకు ప్రా-
ర్థించావా? నా కేజన్మనైనా నీవంటి వంచకకుమారులు వద్దు.
ఇటువంటి అవకతవక మాటలు ఇంకా మాట్లాడుతున్నావు.

శే :— లేదురా చంద్రూ! నీవు చదువుకొన్నవాడ
చక్కనివాడవు. నీలోయున్న చాకచక్యములు ఇంకెవరి
లేవు. నన్ను బయటపెట్టకు. రత్నం చెల్లెల్ని నీకే ఏ విధ
నైనా కన్యాదానం చేయిస్తా. గ్రామాధికారిని వలలో
కొని నీకార్యం పూర్తిచేస్తా.

చంద్రు :— నీవల్ల అయ్యేపనా అది ?

శే :— అలా సందేహించవద్దు. నే నిక్కచ్చిగ చేయిగా
గ్రామాధికారి నాకు ఎంతస్నేహమైనదీ నీకు తెలీదా అబ్బాయీ.

చం :— ఆగాడిదకొడుక్కి ఒకరితో స్నేహంఏమిటి. డబ్బు
ముందు వాడికి స్నేహంగాని, మరి ఎవరిస్నేహంగాని పాటి
చడు – నీమాట వింటాడనుకొన్నావా, ఏమిటి !

శే :— అలా అనద్దుబాబు, ఏముండినా ఆయనకి
వ్యవహారజ్ఞానం లేకపోవడం చేతను, కోర్టులంటే భయంచేతను,
సలహాలేక బ్రతకలేడు. అతడొకపరి అన్నమాటేంటో తెలుసా
"ఈ తాలూకాలోని ఏక్రిమినల్, సివిల్ కోర్టుల్లో ఈశేష–
శాస్త్రులు లేనిదే, పప్పులేని పులగం" అని !

చం :— ఓహో, అయితే నీవు వ్యవహారజ్ఞానం తెలసిన
వకీలు కూడా అన్నమాట !

శే :— చూడ్నాయనా! ఇప్పుడిప్పుడూ యీ ఇంగిలీసు చదువు లావైనకొద్దీ మాకు కొంచెం కొంచెంగా పలుకుబడి తగ్గుతున్నది. అవన్నీ నీకు తెలుసుగా—ఆలస్యమైంది నే వెళ్తా— (అని రెండుఅడుగులు పెట్టేసరికి చంద్రు శేషయ్యనులాగి)

చం :— ఎక్కడికెళ్ళ చూస్తున్నావ్ — నా కేం సమాధానం చెప్పావుకాదు.

శే :— ఏం సమాధానం కావాలిబాబూ ?

చం :— గ్రామాధికారికూతుర్ని నాకు పెళ్ళి చేయిస్తానంటివే, అందుకు నాజాతకం కావద్దా ?

శే :— ఏం — జాతకం లేదూ ?

చం :— లేదు — నాకొకనాడు కోపంవచ్చి ఆకాగితాన్ని అగ్గిపుల్లతో పూర్తిచేశాను.

శే :— (స్వగతము ఓరి కిరస్తానపు గాడిదకొడకా నీకేం పొయ్యేకాలంరా) దానికేం, కొత్తజాతకం బనాయించడం అయిదునిమిషాల పని.

చం :— నేనుపుట్టి 22 సంవత్సరాలవుతుందే. కొత్త కాగితం తయారుచేస్తే సందేహించరూ ?

శే :— (తనలో) నీవు పుట్టిందీ గాడిద పుట్టిందీ ఒకటే. నీకా విచారం పనిలేదు. నా దగ్గిరా పాతకాగితాలు అటకనిండా వున్నాయి. వృథాగా కబుర్లుపెట్టి చంపకురా బాబు - ఆలస్య మవుతోంది — ఎవరైనా ఈ తోవనవస్తే నా మానం

పోతుంది. నా గాయత్రిసాక్షిగా నీపని చేయిస్తా. నన్ను వెళ్ళ సెల విస్తావా !

చం:— ఊ ... నీవు చెప్పిన పని పూర్తిచేస్తే సరి పోయింది. లేకున్న నీగుట్టు బయట పెట్టి నీబ్రతుకు తెల్లవారిస్తా. జ్ఞాపకముంచుకో.

శే:— మంచివాడవుకదూ నీవు — నే నీకు మోసం చేయుదునా — నన్నుమాత్రం బయట పెట్టవద్దు — వెళ్తొస్తా.

(శేషయ్య గబగబ వెళ్లును)

చంద్రు: పకపక నవ్వుచూ నిష్క్రమించును.

(తెరమూయబడును)

# 8 వ రంగము

[స్థలం: మణలూరు సత్రం - కాంచన ద్వారబంధంవద్ద నిలబడియుండును - రత్నం ప్రవేశించును — కాంచన ఆశ్చర్యంతో చూచును.]

రత్నం:— (హీన స్వరంతో మాటలు తడ బడుతూ) "చూడు" మీ నాన్నెక్కడ ?

కాంచన:— (సిగ్గుతో) ఇప్పుడే అంగడివీధి కెళ్ళారు. కేం కావాలి ?

రత్నం:— నాకూ...ఏం...లేదు... నీ పేరేం ?

కాంచన :— నా పేరా...ఎందుకూ...

రత్నం :— ఆఁ...ఊరికే అడిగాను.

కాంచన :— (చిరునవ్వుతో) నాపేరు కాంచన.

రత్నం :— కాంచన...కాంచన...ఎంత మంచి పేరూ! (అంటూ దగ్గరకొచ్చి) నే నిక్కడికి వచ్చింది నీవేమైన తప్పుగా భావిస్తావా?

కాంచన :— అబ్బే...నా...(తల క్రిందికి వాల్చును)

రత్నం :— (సమీపించి అనుమానంతో చేతులు పట్టుకుని) నీ వేమన్నమసరే నీపై నాకుగల ప్రేమ నన్నిక్కడికి నెట్టుకొని వచ్చింది...నన్ను అంగీకరించు.

కాంచన :— (హీనస్వరంతో) అయ్యో...నన్ను విడవండి — మానాన్న వస్తారు...మీరు — వెళ్ళండి.

రత్నం :— నేనా...వెళ్ళేదా...నే నెక్కడికి వెళ్ళేది... నీవు నన్ను తిరస్కరిస్తానా; నీకు నాపై ప్రేమలేదూ?

కాంచన :— (మౌనంతో కొంతసేపుండి) మీ...మీ రెవరో...మీ పేరు...మిమ్మల్ని ఎక్కడో్న చూచినట్లుంది.

రత్నం :— నీకేల అంతఅనుమానం...నేనేగా గ్రామాధికారి కుమారుడను. రత్నం అని పిలుస్తారు నన్ను...నిన్ను నేను హృదయపూర్వకముగా ప్రేమించినాను. నా హృదయ శాంతి తీర్చవా? మదీయ కాంచనా!

కాంచన :— ఊఁ...నేనూ అలాగే...ఐతే...

రత్నం :— ఐతేఏం? చెప్పవేం? నాపై నీకు నమ్మకంలేదూ?

కాంచన :— మీరు నన్ను శాశ్వతంగా పొందగ—తారా...

రత్నం :— నీకు అందుగురించి అనుమానమా...

కాంచన :— లేకేం...మీ పెద్దలూ...

రత్నం :— కాంచనా...నీకోసం...రాత్రింబగళ్లు ... బాధ ఆ సూర్య చంద్రాదులకే తెలుసు...నాకు నీవిషయంలో ఎవరడ్డువచ్చినా లెక్క చేయను...

కాంచన :— నా పవిత్రత పాడుకాకమునుపే నా సందేహ నివర్తించుకొందా మనుకున్నా...మీ రిప్పట్లో చెప్పేట్లు నడుచుకొనుటకు వీలగునా ..., మీ పెద్దలు ... సంఘం వంశం...అంతస్తూ...మర్యాదలూ అడ్డురావూ ?

రత్నం :— వీటిని లెక్కచేయను కాంచా! నీకోసం అగ్గి దూకమన్నా దూకుతాను.

కాంచన :— నిజంగానా ?

రత్నం :— నిజమా అని ఇంకనూ అడుగుతావా ! నీకు యింతే నా హృదయంలోకి తొంగిచూడు. అందు నీప్రతిమగా మరేమైనా ఉన్నదేమో తెలియగలదు.

కాంచన :— మీరు నిజంగా నన్ను ప్రేమిస్తున్నారా?

రత్నం :— నిస్సందేహంగా !...

కాంచన :— నన్ను మీభార్యగా అంగీకరించాలని ఉం—

రత్నం :— నిస్సంకోచంగా !...

కాంచన :—నాకోసం మీరు ఏ త్యాగాన్నయినా చేయు గలరా?

రత్నం :— అందుకొరకై ప్రాణాలైనావిడుస్తానంటే నమ్మి.

(కాంచన రత్నందగ్గరికి వచ్చి వక్షముపై తలవాల్చి దీనంగా చూచి నిల్చును.)

రత్నం :— కాంచనా! నీ మానసికాందోళన అర్థం చేసు కొన్నాను — నువ్వింత విస్పష్టంగా, నీస్థితిని ముందుగా చెప్పి నందువల్ల నిన్ను మరింత నేను ప్రేమిస్తున్నాను — స్వచ్ఛమైన ప్రేమకు సంఘం అంతస్తు గౌరవం అడ్డురావు, కాంచనా! అధైర్యపడకు — నీతోనే నేను జీవితాన్ని గడుపుతాను — నా కంతటి అవకాశాలున్నాయి — నన్ను మాయింట్లోంచే వెళ్ళ గొట్టినా ఏఉద్యోగం చేసో పొట్టగడుపుకోగలను. ఇకనన్ను నమ్మ గలవా? (అంటూ ఆమెమోమును తన వైపునకు త్రిప్పుకొనును)

కాంచన :— (కంటినిండనీళ్ళతో) రత్నంపాదాల వద్ద కూలబడి పాదములను పట్టుకొని అతని ముఖంచూస్తూ) ఈ రోజునుంచీ నేను మీపాదదాసిని—మీరే నా ప్రత్యక్షదైవము. నా సర్వస్వమూ హృదయముతోటి మీ అధీనమే. ఈ కాంచన ఇక మీదురత్నకాంచన అనే నమ్మండి. నన్ను అగౌవర పరచ కుండా మీ యథార్థప్రేమభావాన్ని లోకానికి చాటండి. మన కోరికలు ఈనాడు సఫలమైనవి — జీవితాంతంవరకూ మనల్ని ఎవరూ విడదీయలేరు.

రత్నం :— (మైమరచిన వాడై కాంచనను లేవదీస్తూ) కాంచనాలెమ్మి! కంగారుపడవద్దు. ఈ లోకము నన్నెదిరించి

నను నిన్ను విడనాడను. ఇది సత్యం ... ఐతే, నీ కోసం కొంత చెప్పాలను కొన్నా ... తత్సమయం. మన కోర్కెలు ఇక్కడ సాగవు. ఈ వూరువిడిచి మనమెక్కడైనా పోవాలి.

కాంచన :— అలాగా, అయ్యో... మానాన్న, నా చిట్టి పాపలూ నేలేకపోతే దిక్కులేనివక్కులై పోతారే... వాళ్ళకెవరు

రత్నం :— యోచించుటకు ఇది సమయం కాదు... కొంత పరిస్థితులు చల్లబడినీ ... వెనుక అందరం ఒకటిగా చేరదాం. నామాట విను.

కాంచన :— మీ... యిష్టం.

రత్నం :— ఈరాత్రియే మనం బయల్దేరి పోవాలి. సుమా! అర్ధరాత్రికి నీకై నేను పెరటితట్టు వేచియుంటాను ... నిద్రపోక మెలుకువగాయుండి జాగ్రత్తగా ఎవరికీ తెలియక లేచిరమ్ము.

కాంచన :— ( తలయూడించును. )

రత్నం :—నేవెళ్లుతున్నా... జాగ్రత ......(రత్నం మరుగయ్యేవరకు కాంచన రత్నంవైపే చూచుచు నిల యుండును)

(తెరమూయబడును)

# 9 వ రంగము

[స్థలము : గ్రామాధికారి ఇంటిలో ఒకగది — రత్నం మంచంపై పరుండి ఒక కాగితంలో కాంచన చిత్రం వ్రాస్తూ కొంటూ తన కేర్పడిన ప్రేమను గురించి వర్ణిస్తూ ఒక పాట పాడుచుండును - సుందరమ్మ ప్రవేశించును. ]

రత్నం :— ఎందు కిక్కడికి వచ్చావ్ ?

సుందరం :— ఏం, రాకూడదా - వస్తేఏం... (అంటూ మంచముపై కూర్చొనును)

సుంద :— అన్నయ్యా ఏమిట్రా ఆ కాగితంలో ?

రత్నం :— ఏమీలేదులే, నీకెందుకా కథ ?

సుంద :— ఇలా ఇవ్వేం! చూద్దాం !

రత్నం :— ఊహూం - చూపించను – నీకేల ?

( సుందరమ్మ కాగితమును లాక్కొనుటకు ప్రయత్నించగా, ఇరువురు కొంచెము సేపు పెనుగు లాడెదరు. )

సుంద :— నాకు చూపిస్తావా లేక నాన్నతో చెప్పేదా ?

రత్నం :— ఏముందీ, చెప్పను—నీవు, నీనాన్న, ఏడ్చారులే!

సుంద :— ఊ... పెండ్లి కొడుకుగా...మాటలు కూడా అలాగే ఉంటాయిలే !

రత్నం :— అయ్యో పాపం ! నీకు మాత్రం – ఏం. మీ నాన్న ఒక ముసలికోతికి నిన్ను పెండ్లి చేయింప నున్నాడు.

సుంద :— ఏమిట్రా అన్నయ్యా... ఈ పరిహాసం... నేనేం అంత తీసిపోయినదానవా ... ఎవరుచెప్పారు నీకు ఈవిషయం?

రత్నం :— నన్నడిగితే ...

సుంద :— నీవేగా అన్నీ చెప్పుతున్నావు !

రత్నం :— నేనేం, ఊరికే చెప్పుతున్నా నను కొన్నావా ! మీనాన్న నడిగి కావాలంటే తెలుసుకో !

సుం :— అన్నయ్యా! యీసంబంధంచేస్తే నేనుయో-
గొయ్యో చూచుకొంటాను — నే బతికిబాగుండాలంటే యీ-
సంబంధం తప్పించు — లేకుంటే నీచెల్లెలు నీకిక లేదనుకో!

రత్నం :— నేనంచేయను చెల్లా — నామాటవింటేగా.
నోరుతెరిస్తే 'నోరుమూయ్‌రా, పిల్లవెధవా' అంటాడునాన్న.
నేనెంతదూరం బ్రతిమాలేది — చంద్రుడు నిజంగా చంద్రు-
చక్కగ చదువుకొన్న వాడు—చాకచక్యము గల అందగాడు—అ-
నాన్నకు అతణ్ణిగూర్చి చెపితే...అబ్బో...ఎంతకోపం! ధన
ప్రధానమట ఆయనకి — చంద్రు పావం బీదవాడే 'నే'లేదన్లేదు-
నీవు బంగారము మ్రింగవలయునని ఏమైన కోరుతున్నావా
అతనికెందుకు నిన్నిచ్చి కన్యాదానం చేయకూడదు?

సుంద :— అతనేమి అంతగొప్పవాడట్రా?

రత్నం :— ఆమాటింకా తిన్నగా అడుగుతావా! చ-
వులో బెర్నాడుషా — అందంలో మన్మధుడు — గుణాలలో
గాంధి — ధర్మములో ధర్మరాజు.

సుంద :— సరేగాని, ఆబెర్నాడుషా అంటే ఎవడురా

రత్నం :— మాఅందరికంటే, మరీ గొప్పవాడు.

సుంద :— చంద్రు బీదవాడంటావట్రా!

రత్నం :— ఔను! అయితేనేం?

సుంద :— చదువుకొన్నవాడు ఉద్యోగంచేయకూడదూ

రత్నం :— అతనికిప్పుడు ఉద్యోగం పని లేదని నేనె
చెప్పాను — అతనిని, బి. యల్. పాసుచేసి, జడ్జీగా పొమ్మం-
టున్నాను.

సుంద :— అలాగా !

రత్నం :— ఔను, మరి ఏమనుకున్నావ్!

సుంద :— ఇవన్నీ నాన్నతో చెప్పదునా ?

రత్నం :— ఊ...వద్దు — ఆపనేదైన చేసేవు — నీడొక్క సుద్దాతుంది.

సుంద :— ఏం...ఎందుకు ?

రత్నం :— నాన్నకి ఆయనమాటంటే కిట్టదని ఇదివరకే చెప్పానుగా.

సుంద :— మరినీవు దాచుకొన్నావా- ఆకాగితంచూపిస్తే చెప్పను.

రత్నం :— ఊహూఁ — చూపను.

సుంద :— అయితే పోయి చెప్పేస్తా.

రత్నం :— ( పైకిలేచి ) ఛీ ! బుద్ధిలేనిదానా! పోయి చెప్పేం...నాతల తీసేస్తాడా — ఈ అమాయకపు మృగానికి మంచిదిచెప్తేను ఒకటే చెడ్డది చెప్తేను ఒకటే.

సుంద :— ఎవర్రా మృగం - నీవే ఆమృగమూను, అన్నీను. ( రత్నం పరుగిడిపోయి ఒకదెబ్బవేసి ) నీవిక్కడ్నుంచి వెళ్లు. నీకు చెడ్డకాలం సమీపించిందిలే అని తిరిగి వచ్చుచుండ — సుందరం దెబ్బతిని గబ గబ కొంతదూరం పరుగిడిపోయి నిలిచి "నాదెబ్బ నేను నాన్నతోచెప్పి నిన్నేంచేస్తానో చూడు."

రత్నం :— ( వచ్చినావులే ) అంటూ బయటికి వెళ్ళును.

( తెర మూయుబడును. )

# 10 వ రంగము

[స్థలం: గ్రామాధికారి ఇంటి తిన్నె - గ్రామాధికారి, రామయ్య, గంగాధరం, శేషయ్య, గోవిందయ్య - తిన్నెపై కూర్చొని యుందురు - మొదట చంద్రుడు ప్రవేశించును గ్రామాధికారిభార్య కూతురు తలుపునద్ద నిలచి యుందురు.]

గ్రామా :— చంద్రూ - రత్నాన్ని చూశావా ?

చంద్రు :— నా కగపడ లేదండీ.

గ్రామా :— నాకుమారుని పెండ్లి విషయమై పిల్లని అంతా చూచి అయిందిగదా... ఒక మంచిరోజుగా చూచి ముహూర్తం పెట్టుకోనవలెనని యున్నానండి రామయ్యగారు

రామయ్య :— ఆహా - దానికేం! అలాగే చేయండి ముహూర్తం రోజుగురించి ఒకనిశ్చయానికి వస్తేనే బాగుంటుంది.

గంగా :— (గ్రామాధికారితో) మీరు పెద్దసంబంధం వెదికారండీ - సాంచినసుద్ధులు. మనకు దమ్మిడీకూడ ఖర్చు లేదు. మనవాడు బి. ఏ. చదివినదానికి తగినట్లే రావోవ్వ అమ్మాయికూడా యఫ్. ఏ. చదివిందని విన్నాను.

గ్రామా :— అందుకేగా వాడ్ని బి. ఏ. వరకూ ఖర్చు పెట్టి చదివించింది.

రామయ్య :— ఔను, ఈకాలపు ఇంగిలీసు చదువులకు ఎంతఖర్చవుతుందండీ - నేనూ - వేదం మొనశైరెండువన్నాళా చూ దమ్మిడీ ఖర్చులేకుండా చదువుకొన్నానండి.

చంద్రు :— అది ఇప్పుడు పనికొస్తుందా?

రాము :— పనికిరాకేం!

గ్రామా :— పనిరాకేం - సంస్కృతం దైవభాషకదూ!

చంద్రు :— ఔను.

శేషయ్య:— (తనలో) ఈ ముండాకొడుక్కి ఎంత పొట్ట ప్లీగరయ్యా!

రామయ్య :— మన ఆడబిడ్డకి ఏమాత్రము ఆభరణాలు వేస్తాడటా!

గంగా :— దానికేం, దిక్కుమాలిన నగలు వేస్తాడు. అతను పెద్ద జమిందారుగా, దానికితోడు, ఎంతడబ్బిస్తాడట!

గ్రామా :— పదివేల నూట పదహార్లు.

గంగా :— అబ్బో — పెద్ద మొత్తమేనే.

గ్రామా :— సందేహమా!

లక్ష్మి :— (గ్రామాధికారితో) ఏమండీ, మనవాడు రాకనే మీపాటికి మాటలు జరుపుతున్నారే, — అతడ్నొక మాట అడగొద్దూ?

గ్రామాధి :— వాని ముఖం — వాడికేం — చెఱుకు తినేందుకు రుచికూడా కావాలా?

రామయ్య :— బాగన్నారండీ.

నంద :— నాన్నా— అదిగో అన్నయ్య వస్తున్నాడు.

(అందరు అవైపుచూడ్డురు — రత్నం ప్రవేశించును.)

రత్నం :— చంద్రూ, ఇక్కడాన్న ఇరుక్కొన్నావు—నినా వీధంతా వెతికేసి వస్తున్నాను.

చంద్రు :— నీమాటేగా ఇక్కడ జరుగుతోంది. అందు చేత ఇక్కడ్నే ఉన్నా.

గ్రామాధి :— రత్నం — నాయనా — ఇలారా కూర్చో.

(రత్నం దగ్గరకొచ్చి కూర్చుండును)

సుంద :— నాన్నా అన్నయ్య ......

రత్నం :— ఇక్కడ ఏంపని నీకు ?

సుంద :— అన్నయ్య నన్నుతిట్టేసి ఉదయం కాఫీకూ తీసుకోక ఊరంతా తిరిగి ఇప్పుడొస్తున్నాడు.

రత్నం :— ( వెక్కిరించుచూ సైగచేయును ) ఊఁ అవతల — కాఫీ తీసుకోలేదా — నీకు తెలుసా — ( అని క ఉరిమి చూపించును. )

సుంద :— నాన్నా, అన్నచూడు నన్ను వెక్కిరిస్తున్నాడు

గ్రామా :— ఏంరా మీగొడవ — సుందరం, నీవు లో లికి పోవేం.

సుందరం :— "ఉహూఁ" అన్నయ్యమాత్రం ఉండొచ్చా (అంటూ లోనికి వెళ్లును. )

రామయ్య :— రొట్టెవిరిగి నేతిలో బడినట్లు మనఅబ్బా కూడ వచ్చేశాడు — ఇక జరుగవలసినది మాట్లాడండి.

గ్రామా :— ఔను ! రత్నం ... నీకు ఈనెల్లో చేద్దామని యున్నాన్రా.

రామయ్య :— దానికేం ! కాదంటాడా ? ఇక జరుగవల సింది కానిండు.

చంద్రు :— ఇత నెవరు, పానకంలో పుడక ?

గ్రామా :— పోనిత్తురూ ... ఒక మంచి ముహూర్తం చెప్పండి ఈ నెల్లోనే.

రత్నం :— (లేచి) మన్నించండీ నాన్నగారు — నా కిప్పు డెందుకీ పెండ్లిగొడవ ?

రామ :— (గ్రామాధికారితో) చూశారా ? (రత్నాన్ని చూచి) గొడవ నీకా, మీనాన్నకా ?

శేషయ్య :— ఈ కాలం కుఱ్ఱోళ్లు అలాగేనండీ— ఈపాడు ఇంగ్లీషుచదువు చదవేస్తే చాలు — మన మాటలు మట్టిలో కలిపేస్తారు.

గ్రామా :— (రత్నంతో) శుభవిషయాల్లో ఎందుకరా ఇలాంటి అపశకునపు మాటలు— నీఉద్దేశం ఏమిటి ?

రత్నం :— నా కిప్పట్లో పెళ్లి అవసరం లేదు.

రామయ్య :— ఏం! ఎందుకూ! పిల్లేమైన నీకు పట్టడంలేదా ?

రత్నం :— ఆ ... అలాగే — నాచెల్లి కీపెళ్ళి చేయడం కూడ ఇప్పట్లో నాకు సమ్మతంలేదు.

శేషయ్య :— చూశారా ! ఊఁ ... మాకాలంలో మేం పిల్లని చూశామా, పిల్ల మమ్మల్ని చూచిందా—పెద్దలుచూచి సరి అంటేసరి ! ఇప్పు డేమంటే, కాలం అనకతవకలు గదండీ అయింది !

చంద్రు :— ( గంభీరంగా ) ఆకాలంమాట అలాగేఉంచి ఈకాలంమాట మాట్లాడండి. ( శేషయ్య ఉలికి పడును )

గ్రామా :— ( కోపంతో ) ప్రతిగాడిదకొడుకూ తిండ పోతుల్లాగ నా ఇంటజేరి నన్నాక్షేపించేవాడేనా ... తాంబూలం కూడా ఇచ్చేశాను ... ఇహ తన్నుకు చావండి.

రామయ్య :— ఈకాలంమాట అన్నావే ఏమది బా చెప్పవేం.

రత్నం :— ఈ కాలంలో ఒకరినొకరు ప్రేమించి సమ్మతపడి వివాహం చేసుకోవాలి. అప్పుడే వాళ్ళ జీవితం సుఖంగా ఉంటుంది. నావివాహం నాస్వంతవిషయం. నాహృదయాని సంబంధించింది.

రామయ్య :— అప్పుడు ఆకాలంలో పెళ్ళి చేసుకొ వాళ్ళందరు బుద్ధి లేని వాళ్ళనా ? నీ అభిప్రాయం.

రత్నం :— అది మీకే తెలియాలి.

రామయ్య ( గ్రామాధికారితో ) :— విన్నారా! వి... రా! వెంకట్రావుగారూ...విన్నారా...

గ్రామాధి :— ఒట్టిమూర్ఖపుగాడిదకొడుకు ఎదురుచెప్పి కొద్దీ మరింత కొత్తెక్కుతాడు...(రత్నంతో) ఏంరా! నీమా లకి అంతులేదా ఏమిటి...నీ విష్టపడితే ఏజాతి పిల్లనైనా చేసుకొంటా వనేమాట.

రత్నం :— గుణమే ప్రధానంకాని—కులం ప్రధానంకా

గ్రామాధి :— శివోహం! శివోహం!! శివ. శివ. శివ....
ఏమంటివిరా నిర్భాగ్యుడా—ఈబుద్ధి నీకెప్పడినుండి పుట్టిందిరా?

రత్నం :— నాన్నగారూ...నా కిప్పు డేమీ పుట్టిన బుద్ధి కాదు...ఇది ప్రతి మానవుడికీ ఉండే హక్కు — స్వాతంత్ర్యం!

గ్రామాధి :— ఏంహక్కు! ఏంస్వాతంత్రంరా! నీ వద్దు ఇదా, నీవు ఇంగిలీషుబడిలో వెలిగించిన చదువు—చదివిన వాని కన్న చాకలే మేలుగా ఉందే!

రత్నం :— మీరు చదివించినందుకు చెడ్డేమీ చేయలేదే!

రామయ్య :— ఈ కుఱ్ఱోళ్లు, ఇంగిలీసు నాలుగుముక్కలు నేర్చుకొనేటప్పటికి, అంతా తెలుసుకొన్నట్లు విఱ్ఱవీగి, పెద్ద వాండ్లకే బుద్ధిచెప్ప ప్రారంభించారండీ!

రత్నం :— పెద్ద! పెద్ద! దేనిలో పెద్ద—మీఅర్థం పెద్దంటే వయస్సులోనా, బుద్ధిలోనా? బుద్ధియుంటే, బుద్ధిని ఉపయోగించుకొనే శక్తి ఉండాలి. దేవుడిచ్చినబుద్ధి—దేవుడిచ్చినజ్ఞానం—సరియైనదారిని పోనివ్వక ఎప్పుడూ ఒకటే పద్ధతిలోనే పడి కొట్టుకొంటూ, లోకము ఎలా ముందునడుస్తూన్నదీ తెలియక, ఇలా వ్యాఖ్యానం చేస్తున్నారే — ఈ కులాలు! అంతస్తులు! ఎవరు? ఎందుకు? ఎట్లు? ఏర్పాటుచేసేరో చెప్పండీ, విందాం!

రామయ్య :— వెంకట్రావుగారూ! విన్నారా, విన్నారా! ఈ అసభ్యపుమాటలూ - మనము పెద్దవాళ్ళలో దాఖలాయే లేకపోయింది!

విధి విధానము

గంగాధరం :— అబ్బో! అలాగా అయితే తామే స్టారో శెలవియ్యండి మరిచూద్దాం!

రత్నం :— వినండి. మనపెద్దలు ఈ కులభేదములు ... చిన భావములు వేరు. వాటిని నిజస్వరూపాలను సరిగ్గా ... చేసుకోక—సంఘాలని—సంఘ బహిష్కారాలని యమదూ... వలె ప్రతివ్యక్తియొక్క స్వాతంత్ర్యమును నేలపాలుచేస్తునా

రత్నం :— (పద్యం)

ఆ॥ పరగ బొమ్మగుడ్డు - పరికించి చూచిన
కులములన్ని యందె కూడిపుట్టె
నందులోకట గలియు నన్నదమ్ములెకదా
విశ్వదాభిరామ వినుర వేమ ॥

అనగా — మనలో మానవజాతిలో నాలుగు కులములనునవి ... కుటుంబములోనివే - నలుగురు అన్నదమ్ములలో పెద్దవా... పూజాదిక్రియలు జరుపుకుంటూ కొన్ని దినములకు బ్రాహ్మ... ణ్డైనాడు- అతనికి చిన్నవాడు యుద్ధములో సామర్థ్యుడై సంరక్షణ గావించి క్షత్రియుడైనాడు - అతనికి చిన్న... వ్యాపార విషయములలో కులీనుడై వైశ్యుడైనాడు - కింకను చిన్నవాడు వ్యవసాయాది విషయములం దా శూద్రుడైనాడు. అంతేగాని ఇప్పుడు మీరనుకున్నంత ములో ఈనలుగు రన్నదమ్ములు తమ కుల తతంగ... ప్రారంభింపలేదు. అసలు మొదటివారికి వారి పరిస్థితులు రాను ఒకసహోదరుడు మరియొక సహోదరుని ఇంత నీచమ...

ఇంతదూరముగా ఇంత సంబంధబాంధవ్యములేని హేయముగా చేయునని అనుకొనివుంటే - అస లీకులాలు పుట్టియుండునా! ఈకులాలు దేవనిర్మితమా, మానవనిర్మితమా ? అనేది— పెద్దలని, శాస్త్ర వేత్తలని, పేరు బెట్టుకొనిన మీరెవ్వరైనా యోచనచేసితిరా! స్వలాభాకాంక్ష మిమ్ములను, పాపము అంతవరకు యోచన చేయనిచ్చినదికాదు.

మొదట దేవుడు స్త్రీ పురుష జాతులని రెండింటినిమాత్రమే ఏర్పరచెనుగాని, ఇన్ని జాతులు - ఇన్ని భేదములు - ఇన్ని విభీతులు గల్పించెనా? మీరుమాత్రము మేమి తెలియనివారా! పెద్దలుకారా! ఎన్నియో శాస్త్రము లామూలాగ్రముగ వల్లెవేసిన మీకు ఈసూక్ష్మాతిసూక్ష్మమే తెలియకపోలేదన్న ఎవరు నమ్మెదరు—మీరు అన్నీ తెలిసియు తమ పెద్దతనము ఎచ్చట లోపించునోయనెడి స్వలాభ సన్నిహిత, భూతము మిమ్మావహించుటచేత మీరు తెలియనివారివలె నటించుచున్నారుగాని తదితరముకాదు. ఎవడుజ్ఞాని, ఎవడు అజ్ఞాని, ఎవడు బ్రాహ్మణుడు అనే విషయము, చిన్నవాడగు నేనుమీకుచెప్పవలయునా! ఎవడు స్వచ్ఛంద నీతిపరుడై వినీతిజీవితమే తన సంకల్పమై, పరుల హృదయావేదనే తనదిగ భావించి, లోక కల్యాణము కొరకై సర్వేశ్వర సృష్టికి అర్థము గల్పించి జీవించువాడే జ్ఞాని. ఎవడు దైవసాన్నిధ్య, సంప్రాప్త, సామీప్య, సన్నివేశ, సామ్రాజ్యసంపాదనకై ఆసచ్చిదానందమూర్తిని. సదా ధ్యానించి, సుచరితమే సమాలోచనగావించునో యాతడే బ్రాహ్మ

ణుడు. ఎవడు పరదుఃఖ పీడనాది విముక్తి గావింప కంకణబద్ధుడై పరహితార్థమునకై పాటుపడునో వాడే బ్రహ్మం. శూద్రకులజు డగు వాల్మీకి, విశ్వామిత్ర, సనందనాది ప్రభృతులు బ్రాహ్మ ణేలా అయిరి? వారి సుజ్ఞాన మహిమచేత నేగదా !

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబు ఘటించుచుం బరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్య హితార్థ ఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థ -
గము కావించెడి వారలెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్

అను నీతివాక్యములు మీరువిననిదికాదు. మానవమా ‑ లందరు దైవసృష్టిలో సమానులు. అట్టి దైవసంకల్పమును ఆవలకు ద్రోసి, ఎన్నియో హృదయముల భగ్గునమండిం ఎన్నియో ప్రాణుల మీ స్వలాభమనెడి యజ్ఞకూపమున జేసి, నంగనాచులవలె కన్నులుమూసి హోమమంత్రముల చుట మీకును మీవంశీకులకును పుణ్యమబ్బుటకా, లేక ‑ స్వీకారము కొరకా? మీరు కులముపేరిట జేసిన దూరగతము ఫలితముగ ఎన్నికుటుంబములు ఎన్ని హోవన్మయస్వర్ణ సౌందర్య ములు, ఎన్ని సంసారములు, ఎన్ని ప్రాణులు స్వప్నా ముల మాత్రమే గల్పించి తుదకు, కుమిలి కుమిలి, దుఃఖ మిమ్ముల శపించుచు కూలిపోయినవో తెలియదా !

ఫల మిప్పుడు పండవచ్చినది. ఆ ఫలిత మిప్పుడే ‑

రించి ఈ కులవృక్షమును, కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించి వేయు టకై ఎత్తిన శ్రీగాంధీగారి కుఠారాఘాత ఘూర్ణిల్లి తాయుత శబ్దము మీవీనులకు మృత్యుతుల్యముగను, మాకర్ణములకు అమృత తుల్యముగను వినబడుటలేదా!

గ్రామా:— అప్రేలుడింక నిలువు, చాలవర కెగప్రాకు చున్నావే! నీవా నాకుమారుడవు — నావంశమునకు నీ వొక ముష్టి మొలకవు — ఛీ! నా ఎదుట నిలువకుము. నీమొఖము చూచిన రౌరవాది నరకము సంప్రాప్తమగును.

రత్నం:— తండ్రీ! ఇదేనా మీన్యాయం—నాకు పట్టినగతే నాచెల్లెలికి కూడ పట్టవలసినదేనా! ఆమెను ఒక యువకుడికిచ్చి పాణిగ్రహణము చేయక ధనమున కాసించి, ఒక పండు ముసలికి అంటగట్టెదరా? నక్కమూతికి నెయ్యి పూతయా! పండు కోతికి పనసపండా! నాకన్నతండ్రీ! నీ కింకను దయరాలేదా! సంఘభూతమునకు లోబడి, నీకన్న ప్రేగుల త్రెంచుకొనెదవా! ఇదేనా తండ్రి హృదయము! ఇదేనా జనకప్రేమ! తుదకొక్క మాట ... మీవంశగౌరవము నావలన పాడగునని దలచుటవల్ల నేనిదే పోవుచున్నాను. మీరైనను హాయిగ నుండుడు. కని కరము లేని హృదయాలమధ్య మసలుటకన్నను కనకమున కాసించి కన్యను కొఱతవేయు క్రూరమానవ సాంగత్యమున కన్నను, దరిద్రమే సుఖము. పరదేశపర్యటనమే పరమసుఖము. పోయివచ్చెదను. సుఖించుడు. నమస్తే.

లక్ష్మి:- నాయనా - నాతండ్రీ - నిలు - నిలు - అయ్యో మీముఖానికి ఒక కొడుకుకూడానా!

గ్రామా :— నోరుముయ్ ! నీవు నీకొడుకు తెగలబడ నాగౌరవమే ఈ దుర్మార్గునివలన నశించింది-నేను నలుగురి ఇక తిరుగు టెట్లు ?

లక్ష్మి :- ఆ... వాడుచస్తే మరల మీనుఖమేమి !

గ్రామా :— చస్తాడా—చావడూమరి—వెధవ—తిరిగి కానే పటికి రాడూ - వీడి కెవరు వేస్తారు పిండం — (అంటూ లోపలికి వెళ్లును) (అందరు లేచి వెళ్లుచుందురు)

(తెర మూయబడును.)

# 11 వ రం గ ము

[స్థలం : మణలూరు సత్రం—బిడ్డలున్ను వీరుడున్ను నిద్రించు చుందురు.]

వీరుడు :— (నిద్రనుండి మేల్కొని) కాంచనా... కాంచనా ...కాంచనా...ఎక్కడ...పెరట్లోకేమైన పోయిందా (అటు ఇటు వెదుకుచూ) ఏదీ కన్పించుటలేదే—బయట కెళ కన్నా వెళ్లిందా...ఆఁ...ఊఁ...బయటికే పోయుండాలి(కొ నేపు నిలుచుండి) తర్వాత: బయటికి పోయుంటే ఇంతసేపా ఏమో మోసం జరిగుండాలి...(బయటి కెళ్ళి, తర్వాతలో వచ్చి) ఎక్కడున్ను కనబడలేదే...ఊఁ ( ముక్కుపై వ్రేలు కొని ) ...అదే...ఊఁ...అలా ఉండదనుకొంటా...నాకూ రటువంటిదా...ఏల ఉండకూడదు... స్త్రీ మనస్సు చపల

కదా! ఉండొచ్చు—లేకున్న నాతో చెప్పక ఇల్లువదిలేదికాదు... అదే...ఆమహానుభావుడే...ఆ గ్రామాధికారి కొడుకే పుణ్యం కట్టుకొని యుంటాడు...ఇందేమీ సందేహము...ఊఁ...హా కాంచనా...నన్ను మోసగించితివే...పసిబిడ్డలను ఏడ్పించావే— కన్నతండ్రికి కళంక మిచ్చావే—నాతలవాగ తీసిపెట్టావే...కాంచనా...ఇందుకా నిన్ను ఇంతపెంచి పెద్దచేసింది! ఇందుకా నిన్ను నాప్రాణంగా చూచింది! నాప్రేమంతా నీ కాతనిప్రేమ ఎదుట నిలువజాలకపోయిందా! నేనెంత ఆశతో నీకు వరుని వెదకుచుంటిని-నీకు పెండ్లిచేసి కండ్లార చూడవలయు ననుకొంటినే-నీకు పెండ్లై నీకొత్త కాపురం చూచి ఆనందించా లనుకొంటినే—నీకు పుత్రసంతానము కలిగిన, మనుమళ్లు మనుమరాళ్ళను చూచి ఆనంద పడవలె ననుకొంటినే — నీతల్లి లేకున్నను బిడ్డలకు నీ వున్నావుగదా యని ధైర్యపడి యుంటినే...ఇవన్నియు ఒకక్షణమాత్రమున గంగపాలు చేశావే. ఇదినీకు న్యాయమా! సమ్మతమా! ధర్మమా! బిడ్డా—నీకా ఇటువంటి పరిస్థితి ఏర్పడాలి — ఓ మహేశ్వరీ నీమనస్సుకూడ ఇంత కఠినమా నీవే గతియని నీపాదముల నమ్మియున్న నేనేమిచేయుదు—ఎందుపోవుదు—ఎట్లు ఏడ్తును? (బిడ్డలను చూచి) హా—అయ్యో...నా నాయన్లా— ఇటురండు (బిడ్డలను చేరదీసి) బిడ్డలారా— మిమ్మల్ని మోస— చేసినదే—మీకింకెవ్వరు దిక్కు (బిడ్డలు ఏడ్చుదురు) [illegible] గ్రామాధికారి కొడుకు నానోట్లో విషం పోసినాడే—(బిడ[illegible] తన్ను చూపి) ఈ అభాగ్యశాలి [illegible]

యున్నాడు—వడపకుడు. మీఅక్క చేసినట్లు నేనున్నూ మోసం చేయుదు ననుకొన్నారా ? లేదు...నేను మిమ్ముల విడువలేను. ఎన్ని కష్టము లొచ్చినను మిమ్మల్ని విడువజాలను—మీరు నా నీడ—మిమ్మల్ని భిక్షమెత్తైనను కాపాడుదును.

ఆ దుర్మార్గుడు గ్రామాధికారి కొడుకు — మంచివాని నాకు అగుపడిన మారీచుడు—నన్ను, నాబిడ్డలను వంచించిన మోసగాడు—నన్ను నిందకు పాలుచేసిన నీచుడు—నాబిడ్డకు పోని ఆశలు చెప్పి మోసం చేసినాడు—లేకున్న నాకూతుర అంతదూరంపోవు బిడ్డకాదే—వాడే కారణం—నాకొంపను కూ-నందుకు అతన్ని తేలికగా విడస్తానా ! ఊపిరితో విడుస్తానా ! మనసు చల్లారునా—కానిమ్ము—ఆగ్రామాధికారివద్దకే పోయెద ఈ అన్యాయాన్ని చెప్పెదను—న్యాయము కోరెదను—లేకున అక్కడే నాప్రాణాన్ని విడిచెదను.....వలదు—వలదు. నాకు న్యాయ మేర్పడదు—నన్నే నిందింతురు—నన్నే పరిహాసింతురు—నన్నే దుర్భాష లాడుదురు—నన్నే హింసింతురు—నన్నే వెళ్ళగొట్టుదురు—నేనా బీదవాడను—శక్తి లేనివాడను—తక్కువజా-వాడను—ఉన్న ఒక్క—కూతురిని ధారబోసుకొన్న వాడను—నిష్ప్రయోజకుడను—వృథాప్రయాస—నా కూతురుపై ఆశ—ఆమె ఇప్పడొక వేశ్య—వలదు. అచ్చటికి వలదు. నాబిడ్డలను కాపాడుదా-చూచుకొందును—కానిది కానేరదు—కావలసినది కాకమానదు!

ఇదిగో! ఇప్పుడే-నాబిడ్డలతో ఈఊరు విడిచి వెళ్లుచున్నాన

[గ్రామాధికారి సేవకుడు (సేద్యగాడు) ప్రవేశించును.]

గ్రా—సేవకుడు :— నీకు బుద్ధిలేదు—అప్పుడే పయానమా—ఓరి నీదుంపతెగ—ఎక్కడికిరా ఎళ్ళేది—మాఅయ్య నిన్నెట్టికొ(న)మ్మన్నాడు—ఊ...రా...పోదాం.

వీరుడు :— ఎందుకయ్యా...చేసింది చాలదనా...

సేవకుడు :— అరెబ్బోయ్! పంచేశేసావ్రా—అన్నీ అక్కడికొస్తే తెలుస్తుంది—రా.

(వీరుడు మౌనంగా యుండును)

సేవకుడు :— ఓయియారయా...మర్యాదగారావేం! నెట్టుకపోతా! నాసంగ్తి నీకు తెల్దేమో ... అమ్మో నే బలే కోపగాడు—నాకోపమొస్తే ఎనుబోతును మొత్తినట్లు మొత్తేస్తా—ఆఁ—ఆఁ ... మా ఎనుగోపాల్నాయుకుకూడా నన్ను చూస్తే భయం...నీవేపాటి నాకు లెక్కా పక్కా — గురీగా ఒస్తావా లేక...(అంటూ ముట్టబోవ)

వీరుడు :— ఓగ్రహచారబలమా...ఇంకను ఏమి చేయించెదవో కదా!

సేవకుడు :— ఓహోయ్ - నేనా గహాం ... ఓరి నీకడుపు కొక్కా - రెడ్డోళ్ళ చేద్యగాడు అబయగారి నుబయఅంటే పనివాళ్ళంతా గడ గడ వణికిచస్తారు - నువేమో అనుకొన్నావుం. చూడు నాతడాకా, మా రెడ్డితో చెప్పి నిన్నీ ఊరిలో ఆటాడకుండా చేత్తా. (అని మెడబట్టి తోయును)

వీరుడు :— అయ్యా...నావల్ల మీకేమీ శ్రమ వలదు—నేనేవస్తున్నాను-వచ్చునదిఅనుభవించియేగదాతీరాలి-కానిమ్ము-

మహేశ్వరే నాకు తోడు...(బిడ్డలను చేరదీసి) నాయన్లా
ఇక్కడే్న ఉండండి—ఇదిగో ఐదునిమిషాల్లో తిరిగివస్తున్నా

బిడ్డలు :— (ఏడుస్తూ) మేముకూడా... మేముకూడా
నీతో వత్తాము.

వీరుడు :— అయ్యో మీరువద్దు తల్లులారా ... ఇలా
కూర్చుని ఆటలాడుతూఉండండి—మీకు మిఠాయి, చిన్న చి
బొమ్మలు తీసుకొస్తా.

ఒకబిడ్డ :— నాకు బొంగరం కావాలి.

మరొకబిడ్డ :— నాకూ...వీ-పీ-అది కావాలి.

మరొకబిడ్డ :— నాకు రంగు, రంగు, బొమ్మలు కావా

వీరుడు :— నాబిడ్డలు గదూ...అలానే తెస్తా.

మరొకబిడ్డ :— అక్కనుకూడా పిలుచుకొస్తావా నానా

వీరుడు :— (కండ్ల నీళ్ళతో) ఆఁ ... పిలుచుకొస్తా
ఇక్కడే్న ఉండండి.

సేవకుడు :— మంచిపాపలే...ఇతన్ని చూస్తేనే నాకయేం
లేదు...ఇంకా ఏం గుసగుసలు – ఎల్దాం, రా – ఏం...

(వీరుడు సేవకుడు వెళ్లుదురు) (తెర మూయుబడును)

## 12 వ రంగము

[స్థలము : గ్రామాధికారి తిన్నె – తిన్నెపై గ్రామాధికా
రామయ్యా, శేషయ్యా, గంగాధరం, గోవిందయ్యా, చం

-హర్చొనియుందురు — లక్ష్మమ్మ, సుందరమ్మ గుమ్మంవద్ద నిలబడి యుందురు. కొంత గుంపు బయట నిలబడి గుస గుస మాట్లాడు చుండును. ]

గ్రామాధి :— చంద్రూ ! నీకూడ తెలీదా ? నీకు బాల్య స్నేహితుడుకదూ రత్నం ... నీకు తెలీకనే పోయుంటాడా ? -దుకా వాడ్ని డబ్బు వెచ్చించి బి. ఏ. వరకు చదివించింది ? నావంశాన్నే ఉద్ధరించునని దలచియుంటినే — నాతలపై బండ వేసి పొయ్యాడు.

చంద్రు :— నాకూ తెలియక, రత్నం వెళ్ళడములోనే -ంది ఆశ్చర్యం—ప్రమాదం (గ్రామాధికారితో) మీా రేమన్న ను అంత తొందరపడి కోపించి యుండకూడదు.

లక్ష్మమ్మ :— (ముందుకొచ్చి) ఇహ నే బ్రతుకను — మీాకు బుద్ధి అనేది లేదు - మీావల్ల నాఒక్కకొడుకు ఈ గతయ్యాడు- ను ఏ నుయ్యో గొయ్యో చూచుకుంటా—మీారు, మీా ధనం తగలబెట్టుకోండి.

గ్రామాధి :— ఆదొమ్మరముండను తీసుకుపోయిన అదరి ద్రుని తల్లి బతకడం ఎలాగమరి — ఊరంతా ఇదేమాట — నా మానంపోతూవుంది.

గోవిం :— బెంగపెట్టుకోకండి — బంగారంలాంటి కొడుకు వెళ్ళిపోయాడని ఈపె రాత్రీ పగలూ యేడుస్తూంది — పాపం.

గ్రామాధి :— మరీ... నేనా వెధవను వెళ్ళమంటినా ! నేనేం- ం ?

లక్ష్మి :— చాలు నిలువండి. కన్నకడుపు రగుల్తో

గ్రామాధి :— నాకుమాత్రం లేదా ఏమిటి — అయి మాత్రం — ఊరంతా నాపేరు జపంచేయనివారు లేరు.

లక్ష్మి :— వెఱ్ఱికేకలేయక నోరుమూసుకొని ఊరుకో- ఇరుగుపొరుగువారు — నవ్వగల్రు — మీ కేం మించిపో దిప్పుడు —

గ్రామాధి :— నీకేం మతిపోయిందేమిటి—యిహ నా పనిలేదు. చా వొక్కటేబాకీ.

లక్ష్మి :— మీకు చా వేం వొచ్చింది ఇప్పుడు? ఒక మనవాడు ఆ పిల్లను చెరిపే నుంటే ఏం చేయాలి — ఆ గతి ఏమయ్యేది — అది ఒకమూల గయుంటుంది అని ఊరు కోవాలిగాని — అల్లరి చేసుకొంటూరా? — యీ రోజుల్లో మంది జాతిడిచి పరజాతిలో పెళ్లిచేసుకోలా — పిల్లే చూచినవరకూ—బుద్ధిమంతురాలే—అందంగా కూడా యుంది కులంతప్ప మన అదృష్టమనే చెప్పనచ్చు — ఊరుకోండి.

గ్రామాధి :— అదృష్టమా-నీకేంపొయ్యేకాలం వొచ్చి- నీవుకూడా ఈ కుట్రలో చేరి ఉన్నావేం — ఒసే ముండా — వాడిమాట నీ విన్నావేం — నీ చదు పోయిందిరా — నీ ఇంగిలీసు చదువు తగలబడనూ — ఇహ కను — రామయ్యగారూ — విన్నారా!

రామ :— ఊరుకోండి వెంకట్రావుగారూ, ఏమీ మిం పోలేదు — కన్న కడుపుగదా — అందులోనూ ఒకే కుమారుడు

గదా — రత్నం — పేరుకు తగిన వాడే ..... ఒక కుమారు డుంటే కూడ చాలు.

'ఏకోపి గుణవాన్ పుత్రోనిర్గుణేనశతైరపి, ఏక చంద్రప్రకాశేన, నక్షత్రైః కిం ప్రయోజనం.' అన్నట్లు ఆకాశములో ఎన్ని నక్షత్రము లున్నవి. ఏదైన వెలుగిస్తుందా? లేదు — ఆ ఒక్క చంద్రుడే వెల్తురు నిస్తున్నాడు — అట్లే పలువురు కుమారు లుండుట కంటే మన రత్నం వలె ఒక్క కుమారుడుంటే చాలు.

అయినా మనవాడు ఇలాంటి కార్యం చేయునని నేను కలలో కూడ అనుకోలేదు. ఐతే మాత్రం ఏం? ఇంకా విషయం స్పష్టం కాలేదే!

గంగా :— ఏం స్పష్టంకావాలి — ఊర్లో మాట్లాడుకోవడం మీరు వినరూ — మీా పీనుగెలైనా చెవుడా?

రామయ్య :— సరే కానిస్తూ! అగ్ని గుండంలో నేయి పోసినట్లు మీారు కూడా......

గంగా :— తెల్లవారి ఊరంతా నవ్వుచున్నారాలే — ఇందు నాదేం ఉంది.

శేషయ్య :— (తనలో) నోరు తెరిస్తే ఈ చంద్రము ముం— కొడుకు నన్ను బయట పెడ్తాడేమో ...

( చంద్రమా, అంటూ బయటి కెళ్లును

శేషయ్య :— (నోరు తెరచి) ఆ...(అనేటప్పటికి గంగా ప్రవేశించును)

శేషయ్య :— (తనలో) వస్తున్నాడు కాబోలుదైవమా ఇక మనం నోరు తెరిస్తే ఈ ముండాకొడుకు (ఊరుకుండ కుంటా) గోవిందయ్యను గిల్లి "నీవు చెప్పవేం" అనును.

గోవిందయ్య :— వెంకట్రావుగారి పేరుప్రతిష్ఠ లేమి— గౌరవం...ఎంతకీర్తి...మణలూరు రెడ్డిగారంటే ఈపరిసరం ఇరవై ఐదు గ్రామాదులు గడగడ వణుకునే — అంతెందు... ఒకప్పుడు కాలువనీళ్ళకి ఈ ఇరుగుపొరుగు గ్రామాదుల్లో ప్రజలు గుంపుచేరి కొట్లాట జరుగుతూ ఉంటే—మనరెడ్డిగారు ఆల్పా కోటువేసుకొని, పట్టుబట్ట కట్టుకొని, సరిగ తలపాగ చుట్టు చేతితో నాగపాము పొన్నకఱ్ఱఎత్తుకొని రివ్వున పొయ్యేసు.. గుంపంతా న్యాయము పాలింపవలయు నని పాదాలపై బడి గారిని వేడుకొనలేదా!

గంగా :— ఇవ్వన్నీ వంకలో కలిపేశాడు ఆ పు— త్రుడు — తుదను దొమ్మరిదే దొరికింది, పాపము, అబ్బా...

లక్ష్మి :— ఇక నిలపండి చాలు—మీవల్లే లేనిపోని మానాలు కలుగుతవి — మీకన్నులు, నోరు కాస్సేపైనా ... కుంటేగా!

సుంద :— ( ఏడుస్తూ ) నాన్నా, అన్న ఇక రాడా— వైనా వెళ్ళి పిలుచుకురండి.

గ్రామాధి :— ఇక నేపోకతప్పుతుందా నాప్రారబ్ధం—ఎం కేడ్చేవు...ఆగారడివాడు ఎప్పుడు నాఊరిలో అడుగు పెట్టె డో—అప్పటినుండే నాకొంప కూలడం ఆరంభమైంది—నాకవం...

తెలియకపోయిందే వాడికి దేబ్రతుకని— కానిండు—అమాత్యాలము రానీ—చెబుతా.

[ సేవకుడున్ను వీరుడున్ను ప్రవేశింతురు. ]

రామయ్య :— వచ్చేడే మహానుభావుడు — ఎన్ని కొంపల్ని రా ఇలా ముంచేస్తున్నావ్—పాపిష్ఠీ!

వీరుడు :— ఏమో ... కొంపలా...ముంచడమా - అవి మా త్వరానికే లేదు బాబు.

గ్రామాధి :— ( లేచి ) ఛీ! గాడ్దీ—నోర్ మూయ్—మహా యోగ్యుడు—కన్న తల్లికి విషమిచ్చే క్రూరాత్ముడు...అదో మ్మరి దెక్కడ — అదే ఆలంజ నీకూతురు...

వీరుడు :— అది తెలుసుకొందామనే ఇక్కడికొచ్చాను. న్యాయము దయచేయించవలయును.

గ్రామాధి :— ఆఁ...ఎంత పొగరురా నీకు—న్యాయమా కావాలి? దొంగముండాకొడకా-నన్న డిగియుంటే నీపొట్టకేదైన పారేసుండను—అమాత్రానికా ఇంతద్రోహం చేయాలి—ఎలా మనసొప్పిందిరా—నిన్నేంచేసిన లేరును.

వీరుడు :— మీరలా కోపగిస్తే ఎలాండి—మీరు —ట్లా డడం న్యాయమా—ధర్మమా—తగునా, మీలాంటివారే —క్షిస్తే నాబోటి బీదలకు న్యాయమున కెక్కడ తా వుంటుంది? ఏమీ తెలియని నాకూతురుని మీకుమారుడు పాడిచేసి. ఇంత పనిచేసి...తుదకు నాపైనే నిందమోపచూస్తున్నారు. మేం—

కూటికి బీదలం కావచ్చును కాని వంశ మర్యాదకు బీదలం కామండీ.

గ్రామాధి :— అబ్బో—ఈనగారికూతురు అంతఃపురముల విహరిస్తుంటే నాకొమారుడు పోయి మోహించి చెడిపేశాడట—ఎంతమాట—విన్నారా రామయ్యగారు—ఊఁ... కొత్రా దొమ్మ వెధవను. నీవెక్కడ ఉండి మాట్లాడుతున్నా వనుకొన్నావ్—వ్యభిచరించే నీకూతుర్ని ఒకడేందిరా చెడిచేది ?

వీరుడు :— చాల్లేండి—ఇక నోటినుంచి మాటలు తిన్న రానివ్వండి—మహారాణులకుండే పాతివ్రత్యం గుణము బీద లేదా—మీరిటువంటి అన్యాయస్తులని తెలిసుంటే ఇక్కడికొచ్చే యుండను—మీగౌరవం మీకెచ్చు—నాగౌరవం నాకెచ్చు—మీ కులం మీకెచ్చు—నాకులం నాకెచ్చు—ఎంతబీదవార మైనవ కిన్ని రోషంలేక జీవింపము—రోషమనేది మీకే గాదు—నాకూ ఉంది—మీరు పెద్దలుగాయుంటే అది మీవద్దనే యుండనీండి—ఈ గోచిపాత రాయుడికి దానితో పనియేమి! నేను కష్టం బ్రతుకుతున్నాను—నే నెవర్ని మోసంచేసి బ్రతుక లేదు—బిచ్చ ఎత్తి బ్రతుక లేదు—చాకిరిచేసి బ్రతుక లేదు—మీరు అనుమానించే బ్రతుకు మావద్ద లేదు—అది పెద్దవార్ల వద్దనే యుంటుంది.

గ్రామాధి :— పీడిసిగగొయ్యా - ఓరీ సుబ్బయ్యా! ఇం వేడుక చూస్తున్నావ్ రా - ఆ ఆడుతున్న దెయ్యాన్ని త్రాళ్ళతో బంధించి ఆస్తంభానికి కట్టు - ముష్టి వెధవను.

( సుబ్బయ్య త్రాళ్ళచే వీరుని చేతులను బంధించుచుండును.

వీరుడు :— ఆ. హా—నీ అధికారం కూలిపోను—నాముద్దుల ..మార్తెను పాడుచేసినదిగాక ఇలాంటి అన్యాయము జరిపే వాడా ఒకగ్రామపెద్ద — ఇలాంటి అక్రమము జరిపేవాని చేతు ోనా అధికారం—అధికారం చేతులోఉన్నదని దుర్వ్యయోజనం చేయకుము—సాగుద లున్నదని బీదలను కష్టపెట్టకుడు—దిక్కు నివార్లను దండింపకుము ; హీనస్థితిలో నుండువారిని హింసింప ము ; ధనమున్నదని దార్జన్యము చేయకుము ; బలమున్న ని బంధింపకుము—దేవుడిచ్చినజ్ఞానం, దేవుడిచ్చినకండ్లు, దేవు చ్చిన సంపద, దేవుడిచ్చిన అధికారం వృధాచేయకుము — ారియొక్క సిరి సంపదలు శాశ్వతముకావు. యోచించండి— మ శక్తిలేనివాడే, జ్ఞానములేనివాడే, చదువులేనివాడే, అధికా ములేనివాడే, బీదవాడే, ఐనను మీారున్న నేనున్న భగవం ని దృష్టిలో సమానులమే ! నాకంటె మీారు! మీాకంటె మరి యొకరు ఎక్కువవారిని భగవంతుడు సృష్టించియేయున్నాడు. దినము పట్టినగతి మరియొకరి వలన మీాకు రేపు కలుగదా? యము—సత్యము—ధర్మము పాలింపుము. మీాకిప్పుడు సాగు లున్నదని మీారు నన్నేమైన చేయవచ్చును. మీా కెవరూ డ్డురారు. ప్రజలు పైపెచ్చు మిమ్ము మెచ్చుకొందురు... కాని, వము, సత్యము, ధర్మము మాత్రము సహించదు—వలదు, వవానికన్నీరు రేపు నీకు నీ వంశానికి యమపాశమవును — ా కెన్ని కష్టము లొచ్చినను, మా ఆత్మగౌరవాన్ని ొట్టుకోము.

విధి— విధి ఎవరిని విడిచింది-సర్వేశ్వరు నైనా విడిచిందా

ఊహాః ( చింత, నవ్వుతో )

దేహమా-కష్టపడు-ఇంతకాలం కూతురిని పెంచి పెద్దచేసిన ఫలితముకై కష్టపడు. కన్నకడుపు చేసిన పాపమిదేనని కష్టపడు

అప్పుడే మూడుముళ్ళు వేయించి యుండి యుంటే అవస్థ ఏర్పడియుండదేమో—ఈలోకమే అన్యాయముతో నిండినది. కష్టములనుభవించు. ఓ గ్రామాధికారీ! నాకూతురిని హరించి నన్ను పిల్లపిసుకులతో అనాధునిగా జేసినదిగాక ఈబహుమానము కూడనా... దేవునికికూడా కండ్లులేవా! నీయొక్క అహంకారమునకు అంత్యమేలేదా! కానిండు...మీయిష్టప్రకారము చొప్పున కావింపుము...

ఇక నేను జీవించి మాత్రం ఏం ప్రయోజనం! నాబిడ్డ... వాండ్లను కాపాడువా రెవరు? లేదు — లేదు — నీకై చియే యుంటాను — ఎన్ని కష్టములొచ్చినా జీవించియుంటాను...

రామయ్య :— అయ్యా ... వెంకట్రావుగారు! ఈఅధిక ప్రసంగిని విడిచివేయుట మంచిది. లేకున్న వీని బిడ్డలతో పీడను ప్రాణములను విడిచి, మన కొంపముంచివేయును.

గ్రామాధి :— ఓరీ...ఊరంతా తిరిగి నేర్చిన విద్య ఇదీ! (అని పరుగెడిపోయి రెండుతన్నులు కాలుతో తన్ని లుమిసి, వెళ్ళు — గాడిదె ... నా వూరిలో ఒకక్షణం ఉంటే నీ ప్రాణం దక్కదు...పారిపో.....

వీరుడు :— దుర్మార్గుండా — నన్నా కొట్టావు... నేనునిన్ను
ఏమీ చేయజాలను... నా యొక్క కోపం — రోషం —
... — అంతా ఈ కన్నీరు కాలువ వల్లనే తీర్చుకొనకలుగు
ను. అయితే దేవుడు నీకు శీఘ్రములో కూలిస్తాడు.
సేవకుడు :— ఏంట్రా మొరగడం...పోతావా ఇంకా
అంటావా (అని మెడపట్టి తోసివేయును) వీరుడు వెళ్ళును.
(అందరు నిష్క్రమింతురు.)
గ్రామాధి :— (అట్లనే నిలబడినట్లుండి) నా కింకేమి
వాలి; నాగౌరవం... పేరు — ప్రతిష్ఠ—కుమారుడు—అన్నియు
తి మైనవి — ఈశ్వరా! నే నేమపరాధము చేసితిని — ఇటు
శోధనచేసి కష్టపెట్టుచున్నావు. (అనిపడిపోవును)
...రు లేవదీయుదురు)
రామయ్య :— (గ్రామాధికారితో) వెంకట్రావుగారూ!
విశ్రాంతి తీసుకోండి — అన్నియు త్వరలోనే చక్క
— మీరే ఇలా ధైర్యం విడిచిన — మీ భార్యా
లకు చెప్పవలసిన పనియేలేదు.
...మాధి :— (హీనస్వరంతో) చంద్రూ — అబ్బాయ్
ఎన్న రత్నాన్ని వెదకి తీసుకురా — నాకు వాడిపైనే
ప్రాణం — కన్నకడు పులివేది కాదు.
చంద్రుడు :— ఇదిగో నేను ముందుగానే సిద్ధంగాఉన్నాను —
నే వెళ్ళుతున్నాను. అయితే నాకొక అనుమానం!
గ్రామాధి :— (హీనస్వరంతో) ఎమిట్రాదీ — ఊం...

చంద్రు :— మరేమీలేదు — నెనెట్లో కష్టపడి కనిపెడతా ననుకోండి — రత్నం — ఒకవేళ — ఆపిల్లను వదలివచ్చుట అసమ్మతి తెలిపితే — ఏంచేసే దన్న దే?

గ్రామాధి :— హాయిగా రమ్మను — నాకేం — మాపో చచ్చేవాడ్ని — వాడికుటుంబం — వాడి ఆస్తి — భారం — వాడికిలేని అక్కర నాకేం — ఎలాగో — ఒక వాడో స్త్రీచాలు — నాయనా!

చంద్రు :— సరేనండి — నే వెళ్ళొస్తా.

( చంద్రువెళ్లును — అందరు నిష్క్రమింతురు )

( తెరమూయబడును )

# 13 వ రంగము

[చంద్రుమాత్రం ప్రవేశం]

చంద్రు :— నే వెతకనితావులేదు — అతడెక్కడికి పోయి యుండునో నాకే అగోచరముగ నున్నది.

అక్కటా - రత్నం - ఎంతపని చేసితివి - నాకు రహస్యం చెప్పెదనని పోయినవాడవు — నాకు చెప్పకనే కదూ నావు — పీ టూ ఒకశే అని పలుమారు అనికొన్నది — గమనించ లేదే......... నీకేమన్నను కఠినహృదయ —

am made of different metal) ఐ యాం మేడ్ ఆఫ్ ఫరెంటు మెటల్. నా మైండెప్పుడు నీవలెకాదు. రిలేటివ్స్ (ఫండ్స్ సమయమునకు ఆప్తులని నా కెన్నిసార్లు నీవు యుండలేదు. మరచితివేమో — తప్పులున్నవారు తమ తెరుగరుగదా — రత్నం — మై బిలౌడ్ రత్నం...... రమపత్రం ఒకజాబైన (వ్రాయకూడదా - రహస్యమును నేను దాచి యుండ్దునుగదా — నాచేతనైనంత కష్టములు బడుచునే న్నాను.

న్నిన్నెటైనను కనిపెట్టియే తీరుదును..... ...

ఊ......వేర్ కెన్ ఐ ఫైండు యు(Where can I find ...... ఒకవేళ కొంతకాలం ఎవరికీ కనబడక యుంటే దరు దొరకకుండరనేకదూ నీ అభిప్రాయం! నీ సంగతి నాకు లుసును — శీఘ్రంలోనే నిన్ను మీటవుతాననే నమ్మకం ంది. అయితే రత్నం! నిన్నెప్పుడైనను ఇలా ఇన్నిడేస్ ముంటినా! ఒకవేళ ఇంటికేమైన వచ్చియుండునా? లేకున్న లెటరయినా వచ్చి యుండునా — స్యూరుగా జాబు పోస్టు యుండునేమో, పోయి గమనించెద గాక. నన్నినాళ్లు ండే వాడే గాదు —

( చంద్రు తొందరగా వెళ్ళును )

తెర మూయబడును.

# 14 వ రంగము

[ స్థలము : గ్రామాధికారి ఇల్లు — వెంకట్రా
రామయ్యా — శేషయ్య గుమ్మంలో కూర్చుని యుండ:
చంద్రుడు ప్రవేశించును. ]

చంద్రు :— ఏవండీ — రత్నాన్ని గురించి ఏమీ తెల్లేదు
న్యూసుపేపర్లోనైనా వేస్తే బాగుంటుంది.

గ్రామాధి :— నేకాదన్నానా - అలాగే కానిమ్ము.

శేషయ్య :— వెంకట్రావుగారు! మన ఆడబిడ్డకు చం
చదువు చెప్పిస్తున్నాడంటనే.

గ్రామాధి :— కాపరం చేయబోయేపిల్లకి చదువెందు
లక్ష్మి వింటేగా— చదువు చదువని చంపుతుంది- అందు:
ఆ ఇంగిలీసు చదువు మానేసి కొంచెం ఇంగిత జ్ఞానంరాగల
ణం- దేవునిసృష్టి-మనం ఉండవలసినపద్ధతినీగురించి చెప్పమనా

శేషయ్య :— మంచిదండీ - అలాగే అందుకున్న
చదువు తెలిసియుంటేనే ఈకాలంలో మంచిది.

రామయ్య :— సరే పోనిస్తూ - దానికేం ఇప్పుడు నా
హారం గురించి మీకు ఇదివరకే తెలిపియుంటినిగా - గ్రా
కారివైన మీరే గమనించకున్న నే నేం జేయుట - నా
ఇంటివాని పోరు నాకు పెద్దసమస్యగా మారింది.

గ్రామాధి :— నేను పిలిచి విచారించానుగాని వా
సరియైన జవాబు చెప్పే రకంలో లేదు. మీరుఎలాగూ

రామయ్య :— అలాగా - మీరే అందుకు ఏదో దోవ ...ండి.

గ్రామాధి :— ఇదిగో వ్యవహార జ్ఞానంగల మన శేషయ్యా డేటప్పుడు మనకేం — ఇతడే మార్గము చూపించగలడు.

సుందరమ్మ తలుపువద్దనిలబడి :— నాన్నా! అమ్మ స్నానం చెయ్యమంటూంది.

గ్రామాధి :— ఛీ; పద; పెద్దమనుష్యుల్తో వ్యవహారం ...ట్లాడుతుంటే పానకములోపుడకలాగ అదే పిలవడమా...

శేషయ్య :— తప్పకుండా క్రిమినల్ కేసు తేవలసిందే—క్రిమి... ప్రొసీజర్ కోడుప్రకారం కేసు చేయవలసిందే!

లక్ష్మి :— (బయటకొచ్చి) ఏవండీ, ఎంత పొద్దయింది? పొద్దు అస్తమానం ఇదేమాటలామీకు, లేచిరారేం?

గ్రామాధి :— ఇంతలోగనా — సరే మీరువెళ్ళిరండి — తర్వాత కలుసుకుందాం — నమస్కారం —

(గ్రామాధికారి లోపలికి పోవును—అందరు వెళ్లుదురు).

(తెరమూయబడును)

## 15వ రంగము

[సుందరమ్మ గుమ్మంలో కూర్చుని విస్తరాకులు కుట్టు చుండును — చంద్రు ప్రవేశించును.]

చంద్రు :— (పకపక నవ్వుతూ) అదే (దటీజ్ వెరీ బేడ్

(That is very bad)—నిన్న చెప్పిన పాఠంమూసి పెట్టినావా—లేక జ్ఞాపకం ఏమైనా ఉందా?

సుంద :— (నవ్వుతూ) ఓజ్ఞాపకంఉంది—అదేI learn love you at any caste) ఐ లెరన్ టు లవ్ ఎట్ క్యాస్టు.

చంద్రు :- అట్టే—అట్టే అక్కడే—స్టాప్ — మీనాన్న వచ్చే వేళ — కొంప ముంచుతావు కాబోలు — ఆపాఠం విడిచేయ్. వేరేపాఠం చెబుతా —

సుంద :— ఉ. హుం—బాలనాగమ్మకథ మీకు తెలిసుం చెప్పండీ.

చంద్రు :— ఎప్పుడూ ఆ పాతపురాణాలేనా? ఈభూమి సృష్టి గురించేమీ తెలుసుకో పనిలేదా?

సుంద :— అదేమిటో!

చంద్రు :— చెబతా - ఆవిస్తరాకుల్ను ఆలాపారేసి ఇలా వచ్చికూర్చో.

(సుందరమ్మ నవ్వుతూ చంద్రు దగ్గరికి వచ్చి కూర్చుండును.

చంద్రు :— లవ్ అంటేఏమిటి?

సుందరమ్మ :— లవణ

చంద్రు :— నాన్ సెన్సు - చదువను చదువను, ఉండే మతి కూడా పోతూంది. ఎప్పుడూ ఉప్పు, పప్పు, చింతపండూ మీద నేనా లోకము—

సుంద :— మాటకి అర్థం అడిగారండీ?

చంద్రు :— లవ్ అంటే ప్రేమ తెలిసిందా - ప్రేమఅనేది చ్చటుంటుంది?

సుందరం :— మా ఎనుములవద్ద.

చంద్రు:— ఓ మై గాడ్ (Oh my God)—మీ యింట్లో డే ఎనుములా అడిగాను?

సుంద :— మరి మీరు చెప్ప రేం — ప్రేమ దేవునిసృష్టిలో ంటుంది!

చంద్రు :— మరేం, ఆసృష్టిలో ఏవస్తువు అందమైనది?

సుంద :— కోయిల.

చంద్రు :— (Some thing better) ఇంకా ఆలోచించి చెప్పు?

సుంద :— ఆఁ — మా పిల్లి పిల్ల.

చంద్రు :— Useless - ఇంత చిన్న ప్రశ్నకు జవాబు చెప్ప వా — స్త్రీగావుండి.

సుంద :— అలాగా!

చంద్రు :— ఆ — అదీ...మరీ — స్త్రీకి ఏలాంటిది ఆనందం?

సుంద :— చీరలు — నగలు, ఆనందం.

చంద్రు :— నీ ముఖం — వివాహం చేసుకోనడం.

సుంద :— ఊఁ-హు...మంచిచదువే — మరీ చేస్తేగా.

చంద్రు :— దేవుడు బిడ్డలను ఎందుకుపుట్టించాడు?

సుంద :— ఏడ్వడానికి.

చంద్రు :— దట్ ఈజ్ గుడ్, నీకోటి స్త్రీలను పుట్టించాడు ?

సుంద :— పెండ్లిచేను కొనడానికి – మరీ – మానాన్న ఎందుకు చేయలేదు ?

చంద్రు :— ఎందుకు చేయలేదా ! ఇంకా ఆముసలి జమీం దారునకు యవ్వనము రాలేదట, అతగాడు నుదన కామే లేహ్యాము, అదీ, ఇదీ, తిని బాలకుమారు డైనతర్వాత పెండ్లి చేద్దామని ఉన్నారు.

సుంద :— పోండీ, మీరూను, మీమాటలూను ! అట్లా మాటలంటే నేను వెళ్ళిపోతానుమరి.

చంద్రు :— కోపంచేసికోకు ! ఉన్న మాటలకు ఉలు లకు ? మీనాన్న డబ్బుకు నిన్నిచ్చిపెండ్లిచేస్తున్నాడు. అప్పుడు నీవొక జమీందారిణివి. నీవొంటినిండా నిగనిగలాడేనగలు, చుట్టూ సేవకులు, నివాసానికి నగరులు, కాలుబెట్టితే కారులును అప్పటిలో నేను ఎదురుపడితే 'ఎవరబ్బాయినీవు; ఓహో . చంద్రూ, అంతా బాగున్నారా, వెల్, ఐ యామ్ వెరీ టుడే. (Well, I am very busy today) అని త్వ వెళ్ళిపోతావేమో !

సుంద :— ఇంక చాలు నిలుపండి, మీ ఉపన్యా ఎవరైనా వింటే నవ్విపోతారు. నాకు అలాంటి దర్జాలపై లేదు, మీరూరక నన్నెత్తి పొడవద్దు.

చంద్రు :— పోనీలే. కానీ, సుందరం, నీకు వివాహమైందనుకో, అప్పుడు నీవు నీబిడ్డలు ఇల్లంతా తిరుగుతూవుంటే, ఎంత శోభాయమానంగావుండేది? ఆపిల్లలు మీనాన్నని తాత అనీ, మీఅమ్మను అమ్మమ్మా అనీ, నన్ను నాన్నా అనీ...అ—అ... పొరపాటున అనేశాను. ఏమీ అనుకోకు —

సుంద :— (నవ్వుతూ) మిమ్మల్ని నాన్నఅని ఎందుకంటారండీ, ఆపిల్లలు. మెల్లగా కలేసుకుంటున్నారే!

చంద్రు :— అప్పుడే చెప్పానుగా, పొరబాటని.

సుంద :— పొరబాటు గాకుండా, నిజమే కానీండి, అందులో తప్పేమి?

చంద్రు :— హా! హా! నాప్రియమైనసుందరం, ఇన్ని దినాలు ఈమాట వినలేదే, నేను చాల అదృష్టవంతుణ్ణయ్యాను, నేడు చాల సుదినము. నీపెదవులలోనుండి అంతమాత్రము నీవనడము, నేవినడము —

సుంద :— మాఅన్నయ్యకూడ మిమ్మల్ని గురించి నాతో చెప్పతూవుండేవాడు.

చంద్రు :— అలాగా — నీకు ... నాపై ప్రియంలేదేమో అని అనుకొనేవాణ్ణి.

సుంద :— అలాఅనకండి — నాకు కష్టంగా యుంటుంది — మానాన్న ఒప్పుకొంటేగా!

(గ్రామాధికారి ప్రవేశించును)

గ్రా :— ఏంరా చంద్రూ! చదువు చెప్పుతున్నావా

చంద్రు :— చెప్పుతున్నానండీ! రెండు ఘంటలనుండి.

గ్రా :— ఏదీ నే కూడ వింటాను (అంటూ కూర్చొనును,

చంద్రు :— (తనలో) (ఏంరా ఈ ప్రారబ్ధం — ఇప్పుడు దాపరించాడు అనుకొంటూ) ఊఁ... ఈ భూమిలోని సృష్టి ఎవరు చేశారు?

సుం :— సర్వేశ్వరుడు.

చంద్రు :— దేవుని తర్వాత ప్రత్యక్ష దేవతలెవరు?

సుం :— నాన్న, అమ్మానూ.

గ్రా :— భలే! చంద్రూ! విద్య చాల చక్కగా చెప్పించు న్నావు. ఇట్టి నీతులే బిడ్డలకు బోధించితే చాలు, నీవు చాల బుద్ధి మంతుడులా అగుపడుచున్నావోయి చంద్రూ.

చంద్రు :— దేవుడు సృజించిన వస్తువులలో చాల నీకు నచ్చినదేది? (అని కన్ను గీటును)

సుంద :— తాంగళ్.

గ్రా :— ఏమబ్బా యిదీ; అలాగంటుందీ, దానికర్థమేమిటి?

చంద్రు :— తాంగళ్ అంటే లాటిన్ భాషలో, తాయి అంటే అమ్మని, గళ్ అంటే మొదలగు పెద్దలు అని.

గ్రా :— బేష్; బేష్; చాల మంచి చదువే చెప్పి స్తున్నావు; గాని ఆడవాండ్లకు, లాటిన్లు, ప్లాటిన్లు లేక మన

భాషలోనే అన్నీ నేర్పండి. పాఠము ఈ దినానికి నిలపండి. మీతో కొంచెము మాట్లాడుదము. వెళ్ళుదమురండి.

(చంద్రు: గ్రామాధికారితో వెళ్ళును.) (సుందరమ్మ నిష్క్రమించును.) తెర మూయబడును.

# రెండవ అంకము

## 16 వ రంగము

[స్థలం : మదరాసు — ఇంటిలోని ఒక గది — రత్నం — కాంచన క్రొత్త కాపురం.]

రత్నం:— కాంచనా, మన క్రొత్త కాపురం ఎలాగుందీ ?

కాంచన :— బాగానే ఉంది — కానీ......

రత్నం :— కాంచనా, ఉందీలు, కానీలు బయలుదేరినాయి. నీ అనుమానమేమి ?

కాంచన :— మరేంలేదు — ఈ సునో—పిండి—ఇంకేమో చెప్పారే ...... ఇవి ఏమిచేయును ?

రత్నం :— (నవ్వుతూ) ఓహో...అదే — ఆపౌడరు అద్దు కొనేది.

కాంచన :— కానిస్తురూ — ఇలాంటివి నాకు సరిపడవు. —ఇ — ఇది మాయసౌందర్యమును కల్పించేదే కదూ. ఇవంతా మీరే వాడుకొనండి — నాకేం సర్దాలేదు.

రత్నం :— (నవ్వుతూ) నేనేం స్త్రీనా వాడేందుకు – నీకే గదూ కొని తెచ్చింది!

కాంచన :— అవన్నీ నాకు తెలీదు – నాకవి నచ్చలేదు

రత్నం :— అవి ఎటువంటి వనుకొన్నావ్ – కాంచనా – ఇవంతయు సీమలో తయారైనవి.

కాంచన :— సీమ – గీమ...... అనేది ...

రత్నం :— సీమంటే, లండన్, సముద్ర మవతల వుంది. వీటిని వాడుకుంటే, ప్యారిస్ లేడీలా గుంటావు.

కాంచన :— ఏంటీ – లేడీ, గీడీ అని, తిట్టుతున్నారే!

రత్నం :— తిట్టడం కాదు కాంచనా; లేడీ అంటే అందమైన స్త్రీ అని అర్థం.

కాంచన :— నే నిప్పుడు మీ కంటికి బాగులేదా.

రత్నం :— ఊహుఁ. ఆలాగనడం కాదు. ఇప్పుడు కాంచనలా గున్నావు. వీటిని వుపయోగిస్తే రంభా, ఊర్వసీ, తిలోత్తమా, గ్రేటాగార్బో, లీలాచిట్నిస్, సురయా వలె ఒక బ్యూటిఫుల్ స్టారు (Beautiful - Star) లా గుందువు

కాంచన :— ఏఁవండీ – మీకు తెలిసిన ఇంగ్లీషంతా నావద్ద వర్షంగా కుమ్మరిస్తున్నారు. నాకివి ఇష్టపడలేదు.

రత్నం :— ఓ. దానికేంఅభ్యంతరం. అయితే యివివద్దా

కాంచ :— ఊహుఁ. వద్దూ.........నే నడిగేది తెండీ.

రత్నం :— ఏం – నువ్వడగటం (తల గీరుకొంటూ). నీకేం కావాలో అదైనా చెప్పు.

కాంచన :— తప్పక తెచ్చిస్తారా ?

రత్నం :— అదేమి నీకు సందేహామా ? ఇప్పుడే కొని కొనొస్తా.

కాంచన :— సరే ! మంచి పసుపు, మంచి కుంకుమా తెండి. అప్పుడు ఎలాగుంటానో, మీరే చెపుతారు.

రత్నం :— ( హీనస్వరముతో ) ఆహా ఇప్పుడే చెపుతా - సాక్షాత్ గౌరీదేవిలా గుంటావు.

కాంచన :— బాగా చెప్పేరండీ ; అదేలాగుంటానా !

రత్నం :— ఏమీ సందేహాములేదు. ఇక నేచూసి, సంతో ంచ వలసినదే ఒకటి బాకీ. ( కాంచనకు తెలియని హీన స్వరములో ) ఊం...... ఇవి పుట్టుకతో రావాలి.

కాంచన :— ఏమంట్రి. గట్టిగా చెప్పరేం ?

రత్నం :— మరేమి లేదు. మంగళకరంగా వుంటావని చెప్పాను.

కాంచన :— అయితే అవి యీ దినమే తెస్తారా ?

రత్నం :— తప్పకుండాను - అయితే సబ్బైనా వాడు కుంటావా, లేకా......అదికూడా.........

కాంచన :— ఓ. అది వాడుకుంటా. డబ్బంతా వృథా ఖర్చు చెయ్యకండీ... ఇక డబ్బులేకపోతే ఏంచేస్తారు ?

రత్నం :— దాన్ని గురించి నీవు విచార పడవలసిన అక్కరలేదు — ఉన్న డబ్బు ఖర్చైపోవచ్చును......డబ్బు దొంగలపాలు గావచ్చు — ధనవంతుడు బీదవాడై పోవచ్చును.

విద్యను ఎవరూ దొంగిలించలేరు కదూ......... నాకున. విద్యతో పొట్ట గడుపు కొందును......ఊఁ......నిన్నన ఒక కంపెనీలో ఉద్యోగము కుదిరింది. ఆ కంపెనీ మేనేజరు చాల మంచివాడు — నాకు క్యాషియర్ పని యిచ్చాడు నెలకు వంద రూపాయలు జీతం.

కాంచన :— బలే జాగ్రత్తమనిషండీ — మీరు ...

రత్నం :— లేకపోతే, నిన్నిక్కడికి తీసికొస్తానా ?

కాంచన :— గేలీ చేస్తారేమో...నాకీవూరు సుతరాము నచ్చలేదండీ—మనగ్రామంలో వుంటే, గంజిత్రాగినా అమరసుఖమును పొందచ్చు — మానాన్న, నాతమ్ముళ్లు, నాచెల్లెం ఎలాగున్నారో ?

రత్నం :— వాస్తవమే — ఎందుకైనా కొంతకాలం వేగ యుండాలి - పరిస్థితులు ఎప్పుడూ యిలాగే యుండవు. శీఘ్రంలోనే పరిస్థితులు మారగలవు. మనవార్లనుకూడ కలుసుకు అవకాశం వస్తూంది.

కాంచన :— ఎప్పుడో !

రత్నం :— ఎప్పుడో, ఏమి ! మనకీ మదరాసు, శాశ్వ కమా—మనము మదరాసును విడిచిపోకున్నను, మన ఆంధ్ర రాష్ట్రం నిర్మాణమైన వెంటనే, మన గ్రామం వెళ్ళి, మన రాజ మును బలపరచుటకు తోడ్పడై యుండవలసి వస్తుంది.

కాంచన :— ఏమండీ - మీరు చెప్పడం - నాకుఅర్థంకావటం లేదు — ఒక మాట చెప్పితే, ఒక వందమాటలు చెబుతారు. నాకెలా అర్థము తెలిసేది?

రత్నం :— నీకిప్పుడంతా ఏమీ అర్థముకాదు, కొంతకాలం
వాలి కాంచన, నీకు నీ తమ్ముళ్లు, చెల్లెండ్రంటే ఎంతశ్రద్ధ!

కాంచన :— అవునండీ-నాకెంతో శ్రద్ధ. వాళ్లపై నేజ్ఞాపకం.
గాకలలో కూడ వాళ్ళే; నే నెప్పుడు వాళ్ళను చూచెదను మరీ?

రత్నం :— అటువంటికి పిల్లలు యిక్కడ వుంటే నీకు
యిష్టమేనా?

కాంచన :— అదేంటండీ! నాకు సరదా లేదంటున్నారు?
న్న చిన్న తప్పటడుగులు వేసుకుంటూ యిల్లంతా పిల్లలు
గుతూంటే, ఎంతముద్దుగా ఉంటుందండీ.

రత్నం :— ఆ సరదాలు; ముద్దులు; నేనూ, ఎరుగుదును-
పరిస్థితుల్ని బట్టి...పిల్లలు మనకి యిప్పుడు అవసరం
వనుకుంటా.

కాంచన :— ఏం! మనకు పోషించుకొనే శక్తిలేదనా,
భయం?

రత్నం :— ప్రస్తుతం ఆ యిబ్బంది లేకపోయినా......
ముందు కలుగుతుందిగా......

కాంచన :— ఎలాగా......

రత్నం :— మన మిద్దరం కలిసి ఒక నెల రైనా పూర్తి
లేదు, ఏడాదికో పిల్లవాడు చొప్పున పుట్టుకొని వస్తూంటే
కేళ్ళు నిండకుండానే మనకి అరడజను పిల్లలు పుట్టుకొస్తే
భరించడం చెప్పు?

కాంచన :— ఎంత అంచనా వేశారండీ...చదివినవా కదూ మీరు...నా తమ్ముళ్లు చెల్లెలు అని చెప్పి మనపిల్లలని పేస్తున్నారే...ఊఁ...అలా కూడ ఉండనీండి...సంతానమే సిరి సంపదలు కదూ!

రత్నం :— పిల్లలు లేకుండా ఉంటేనే మనమిద్దరం కొన్నాళ్ళపాటు హాయిగా, ఏరోజు కారోజు కొత్తకాపరంలా గడపొచ్చు.

కాంచన :— అదేమిటండీ ... అలామాట్లాడెదరు. మీకు పిల్లలంటే ఇష్టంలేదండీ? ఇప్పుడే తెలిసిందే ఈ విషయం...అలాంటప్పుడు నన్నెందుకు ప్రేమించి ఇక్కడికి తీసికొచ్చారు?

రత్నం :— ఊఁ! ఊఁ!... పిల్లలకోసమే...

కాంచన :— మరి యీమాటలేమిటండీ?

రత్నం :— పిల్లలు అసలువద్దు అని అనడంలేదుగా — ఇంకా కొన్నాళ్ళు పోయాక కలుగుతారు.

కాంచన :— మనకి కావలసినప్పుడు వస్తారాపిల్లలు?

రత్నం :— నీలో పిల్లల్ని కనేలక్షణం ఉందని ఈరోజు తెలిసింది కదా!

కాంచన :— చాలు ఊరుకోండి — మీపరిహాసం.

రత్నం :— ఊఁ...సరే (చేతిలోని గడియారంచూసి) టైము అయింది. ఇదిగో బజారుకు వెళ్ళి టిఫిన్ తెస్తాను...అట్లే నీవడిగిన వస్తువులుకూడ తెస్తా.

కాంచన :— ఏమిటదీ .... ట వ.....

రత్నం :— (నవ్వుతూ) టిఫిన్ అంటే తినేవస్తువులు.

కాంచన :— కానీ లెండి.

రత్నం :— ఇదిగో, ఐదునిమిషాల్లో వస్తా.

(అని వెళ్ళును)

(కాంచన నిష్క్రమించును. కాంచన — పాట)

(తెరమూయబడును)

# 17వ రంగము

[స్థలం : గ్రామాధికారి ఇల్లు — లక్ష్మి, సుందరమ్మ, ద్రు, గ్రామాధికారి, రామయ్య. గ్రామాధికారి జబ్బుపడి నముపై పరుండియుండును. చంద్రు చికిత్సచేయుచుండును.]

గ్రామాధికారి :— (దగ్గుతూ) చంద్రూ - మావల్ల నీకెందుకీ ం...(దగ్గును)

చంద్రు :— ఏం శ్రమ లెండి - రత్నం లేనప్పుడు మీకు చేయ ిన సేవకు నేను బద్ధుడనుకానూ ?

గ్రామాధి :— నాయనా, నీవు లేకున్న ఇంతశ్రమ ఎత్తు —రెవరు - మొదట్లో నీపై పొరబాటుగా అభిప్రాయ - (దగ్గుతూ) ఇంత తెలివితేటలతో నీవు మాకుగాను ..రాసపడినందులకు నేనేమి ప్రత్యుపకారము చేయబోవు _ను — మా రత్నానికి బదులు నీవేగా మాకు.

రామయ్య :— ఎటూ మీ అల్లుడు కానున్నాడు చలసి. అలాంటప్పుడు మీగ్గాను శ్రమపడ్డంలో ఏం ఆశ్చర్యముందీ.

గ్రామాధి :— (దగ్గుతూ) ఏం అల్లుడో — ఏం పెండ్లో నాకా లోజబ్బు కుదరలేదు — నా రత్నంవిషయము - తెల్లేదు... నేను ముందు వెనుక లాలోచించక అవసరప.. శాను— ఇప్పుడు అనుభవించుచున్నాను — పుత్రశోకం నామ నును బంధించివేసింది — (దగ్గుతూ) అయ్యో తండ్రీ రత్నం — నీవెక్క— డుంటున్నావో—ఏం కష్టపడుతున్నావో—నీకెందుకీఅవస్థ ... నేనేమో తెలిసియో తెలియకయో రెండుమాటలు .... విడిచినందుకు నన్ను ఈలాంటి దురవస్థలో విడిచివెళ్లుట న్యాయంకాదు — (దగ్గుతూ) రా—రా — రత్నం, నేనూపిరి ఉండేటప్పుడే నాచేతుల్లో రెండు శేషలు పెట్టుకో—నీ ఇష్టప్ర కమే నడుచుకో — నీకోరికకు ఇక అడ్డంకులు లేవు — నీకు - వదే నాకునచ్చినది (ధగ్గును).

చంద్రు :— కాసేపు నెమ్మదిగా యుండండి — జబ్బుగా యున్నప్పుడు ఇలా మనస్సును నొప్పించకూడదు. - యెక్కువ తీసుకోవాలి—ఇదిగో డాక్టరుగారుకూడ వస్తున్నా

(డాక్టరు ప్రవేశించును,

చంద్రు :— హల్లో డాక్టర్ సుందర్— కమ్మిలాంగ్ ఇలా కుర్చీపై కూర్చోండి.

డాక్టరు కుర్చీపై కూర్చుంటూ :— థ్యాంక్సు మిస్టర్ చంద్రూ — ఈవేళ కొంచెం ఆలస్యమైందికదూ !

చంద్రు :— డజన్‌ట్ మేటర్ — విశేష మేమో జరిగి యుండాలి — ఎక్కడైనా బయట కేసుకెళ్ళారా?

డాక్ట :— అబ్బే ; యు ఆర్ రాంగ్, దట్ ఈజ్ అదర్ వైస్ — ఎ కాంప్లికేటెడ్ అండ్ సీరియస్ కేసండి. అంటూ గ్రామాధికారివద్దకువచ్చి పరీక్షించి,—మిస్టర్ చంద్రు—దేహంలో జాడ్యమేమీ అంతగాలేదు—ఇది మనోవ్యాధి — మనోవ్యాధికి మందులేదు—విశ్రాంతి చాల అవశ్యం—ఎవరితోనూ మాటాడ నియకుము-ఎప్పుడూ-సంతోషంగా ఉండేటట్లుచూడాలి-ఇదుగో ఒకచీటీ వ్రాసి) ఈచీటీలోని మందును తీసిఇమ్ము — ంచెం పుష్టమవును. అయినా చింతలేదు. జాగ్రత్తగా చూచు నండి—మనసును నొప్పించే మాటలేవియు మాటాడకూడదు. ాపు మరల వస్తాను. Good evening.

(డాక్టరు వెళ్ళును)

(పోస్టుమ్యాన్ ఒకకవరును చదివి ఎక్కడండి గ్రామాధికారి గారు అని అడుగును)

చంద్రు :— ఇలాఇమ్ము (అని పుచ్చుకొనును).

గ్రామాధి :— చంద్రూ- అబ్బాయీ- ఈజాబు ఎక్క డ్నుంచి వచ్చింది— ఈలెటరు కాస్త చదివి వినిపిస్తావా?

రామయ్య :— రత్నంవద్దనుంచి ఏమైనా వచ్చిందా?

చంద్రు :— అదేగా చూస్తున్నా —

ఊc - రత్నంవద్దనుండి- కాదు- ఇదెవరిదో చదదుతావినండి

కొండపల్లి,

1- 1- 1950.

మ. రా. రా. శ్రీ. రాజాధిరాజ రాజగంభీర — మార్తాండ శ్రీ మొగలీశ్వరాలయస్థాపక సూర్య వంశపారావా- వంశోద్ధారక అజేయ బిరుదాంకిత శ్రీ శ్రీ శ్రీ రాజా భయంక- భూపతిరావు బహదూరు, కొండపల్లి జమీందారు.

శ్రీయుతులు మణలూరు గ్రామాధికారైన శ్రీ వెంక- వుగారికి ఉభయ కుశలానంతరము వ్రాయడమేమన :—

ఇక్కడందరు క్షేమముగా యున్నాము. అలాగే, యొక్క క్షేమమున్ను మీ బంధుమిత్రుల క్షేమమున్ను ము- ముగా మీకుమార్తె క్షేమములున్ను తెలిసికొనుటకు ఆతురతతో యున్నాము.

మన మింతవరకే నిశ్చయించుకొన్న వివాహ విషయ- తిరిగీ చర్చించి ఒక మంచి ముహూర్తము చూసి నిర్ధా- చేయుటకొరకు 10- 1- 50 తేదీలో తెల్లవారి రైలుబం- బయలుదేరి నేను, నాకుమార్తె సాయంత్రం మీ గృహమున- వస్తున్నాము. మీకూతురును నే నెటూ నేరులో చూడవలెన- నని అభిప్రాయపడినాను. అలాగే నాకుమార్తె కూడ మీకుమా- రుని చూడవలయునని కోరియున్నది. వివాహ సంబంధమైన కార్యములంతా ఇప్పటికే చాలవరకు పూర్తిచేశాను. కాన-

మీరు మీ బంధు మిత్రుల పరివారముతో సిద్ధంగా యుండి మమ్ము ఎదురు చూడవలసినదని ఇందుమూలముగా కోరడ మైనది. మిగిలిన విషయములు నేరులో.

ఇట్లు

భూపతి రావు బహదర్ వారు.

గ్రామాధికారి :— (దగ్గుతూ) వచ్చిందిలే — ఇంక నిక వస్తున్నాడు కాబోలు ఇక్కడికి- ఆయన కూతురిని తీసుకుంటామని వచిందే మాకీ గతి పట్టింది - ఇక పెండ్లైతే నాకొంపే కూలిపునేమో!

రామయ్య :— ఔనౌను— మీరుచెప్పేది నిజం.

లక్ష్మి :— ఆయనకూతురు మనకు పనిలేదు — మనబిడ్డను ఆయన కివ్వాల్సిందిలేదు — నేనప్పుడే చెప్పానుగా ఈయనకు, పోయిపోయినుందరాన్ని ఆముసలివానికి ఇవ్వకూడదని. ఈయన టేగా—వాడెంత ధనవంతుడుగా ఉంటే మనకేం — మనబిడ్డ వాడింట్లో బంగారము మింగబోతుందా — వృధాగా మనముద్దు పను బలి ఇవ్వ తలచారే!

సుందరమ్మ :— నాకేం ఇష్టంలేదు, లేదంటే నే నే నుయ్యో గొయ్యో చూచుకొంటా.

గ్రామాధి :— ఊరుకో, ఇంకేం అన్ని తెల్లవారిందే — ఆరత్నం మాత్రం ఇక్కడఉంటే వాడికిన్ని రత్నానికిన్ని ఒకే ముహూర్తంలో పెండ్లి ముగించేస్తునా. తర్వాత ఈగొడవంతా

రాదుగా — చంద్రూ ఇంకొకసారిదైనను రత్నాన్ని — తీసుకొస్తావా?

లక్ష్మి:— ఏవండి, ఎప్పుడూ ఇలాంటి అవకతవకలైన మాటలా — చంద్రు లేకున్న ఇక్కడ మీకెవరు సహాయం

గ్రామాధి:— ఏమే — రామయ్యా; శేషయ్యా — వీళ్లేరు

రామయ్య:— ఏముంటేను - చంద్రుడుండే దోవమాగ రాదు. డాక్టరును పిలుచుకొని రాను పోను మాట్లాడను అతని తెలివి మరి. ఎవరికుంది?

గ్రామాధి:— మీరుమాత్రం ఏం చేయలేరా?

రామయ్య:— చేయలేక నేకదూ. అయితే-ఆ రెండు ఇంగ్లీషు ముక్కలు మనకురావు. ఆ డాక్టర్లుకూడ ఇంగ్లీషుమాట్లా వాడుగా ఉంటేనే మర్యాదిస్తారు. చంద్రు డెటూ బి. డాక్టరికీ ఇతనికీ సరిపోతుంది కావున ఇలాంటి సందర్భము చంద్రు డిక్కడనే ఉండడం ఉత్తమము.

సుందరమ్మ:— ఔనునాన్న — ఈయనగారుంటేనే మీకు మంచిది...మనసుబ్బయ్యను పంపించి చూతామేం?

గ్రామాధి:— వాడిమొఖం, వాడివల్ల అయ్యేపనా?

(సుబ్బయ్య దీన్ని వింటూ ప్రవేశించును)

సుబ్బయ్య:— ఏమండీ అయ్యగారు—నావల్ల అవదంటాగా మీరు విన్నారా; మా ఈరయబావకొడుకు పెళ్లిచేసుకోవక అలిగి ఎల్లబారి పోయినప్పుడు నేనేగా ఈఉత్తరాదంతా — వాడ్ని పట్టుకొస్తి — మాబావ నాకాలికి కంటివేశాడు.

రామయ్య :— ఏఁవండీ—వెంకట్రావుగారు—మీరలా అసా
ారణంగా తలవకండీ మన సుబ్బయ్యను—మీఎదుటనే కొంచెం
ణకువగా యుంటాడు. మరి చూడండీ, మీ సేద్యపు పను
లంతా ఎలా నడుపుతున్నాడో—ఊళ్లోకూడ మంచి పలుకుబడి
ఉంది వీడ్కి—పంపించేచూడండిమీ.

గ్రామాధి :— సరే — అలాగే చేద్దాం. ఒరే సుబ్బయ్యో
ళ్ళొస్తావా...ఇంకొక విశేషం కూడాను...ఆగారడివాని కే
మైన రత్నం గురించి తెలిసి యుండొచ్చు—రత్నాన్ని వెద
కడం నీవల్లకాదు—ఆ గారడివెధవ—ఈ పరిసర గ్రామాదుల్లో
క్కడైన ఉంటాడు—వాడ్ని కనిపెట్టి—మంచిమాటలు చెప్పి
డ్ని ఈడికి పట్టుకురా.

రామయ్య :— మంచియోచన ! మంచిగా ఇక్కడికి తీసు
ురా — వాడ్ని మంచిచేసి రత్నం ఎక్కడున్నాడో కను
ుంటాం—నీవు అవకతవకలుగా మాట్లాడిపోదువు జాగ్రత్త !

సుబ్బయ్య :— ( గ్రామాధికారితో ) ఈపని నాకు విడచి
ండి. చూచుకోండి మరి వాడ్ని ఈ నచ్చత్రం వచ్చేలోగా
ొస్తా నా దెబ్బ — నా కుత్తర్విస్తా గా ?

గ్రామాధి :— మంచిది—వెళ్ళిరా—శీఘ్రం రావాలి.

అందరు నిష్క్రమింతురు.

( తెర మూయబడును. )

# 18 వ రంగము

[ స్థలము : కొండపల్లి – జమీందారుని భవనములోని డ్రెస్సింగ్ రూము – జమీందారు – సేవకుడు. ]

జమీందారు :— ( అద్దము చూచుకొంటూ, కూనురాగ ముతీయుచూ ) ప్ఫ్యాన్ –అ... వెంద్రుకల కప్‌నుతీసుకురా !
( తిరిగి కూనురాగముతీస్తూ అద్దాన్నిచూచుచుండును )

సేవకుడు :— ఇదిగోనండి – మీసాలకివేసేనల్లకప్పు

జమీందారు :— ఏంరా–గాడ్దీ...నిన్ను కప్ పట్టుకర_ న్నానా లేక–కప్పుగురించి వర్ణిస్తూరమ్మన్నానా?

సేవకుడు :— చిత్తం–చిత్తం – తప్పేనండి – కామందు వారు మన్నించాలి.

జమీందారు :— ఊఁ... పాపం నీవేంచేస్తావు – దొ_ కూడుగదూ ! ( జమీందారు మీసాలికి కప్పువేస్తూ అ_ చూస్తూ ) ఒరేఒరే, ఇలారా.

సేవకుడు :— ( ఆతురతతో ఏవండీ ; ఏవండీ ?

జమీందారు :— ఇదిగో – ఇప్పుడు నేనెట్లు కన తున్నాను.

సేవకుడు :— బలే ; బలే...మీకుసెంట్లెచ్చేసి పోయా ఆసాయిబు లాగానే యున్నారండి మీరు.

జమీందారు :— ఛీ ; నోరుముయ్ ; వెధవ ! సాయి నేను, వెట్టికుంక ?

సేవకుడు :— ఔనండీ !

జమీందారు :— ఏమిటా......

సేవకుడు :— ( భయముతో ) లేదండీ.

జమీందారు :— ఏమిట్రా ; అవునండి ; లేదండి పిచ్చి పుల్లయ్య — ఇలారా... ( సేవకుడు భయపడును ) ...ఆ...ఆ పట్టుదట్టీ పట్టుకురా ( సేవకుడు తెచ్చును. )

జమీందారు :— కడుపుబయటికి తెలియకుండ నడుముకు బిగించి కట్టు.

సేవకుడు :— ఊఁ — ఊఁ — ( అని బిగించి కట్టును. )

జమీందారు :— అబ్బ...; ఈపొట్ట ఒకటిపోరాటంనాకు.

సేవకుడు :— ( గట్టిగా బిగుస్తూ ) పొట్ట కన బడకుండా చేస్తానండీ...

జమీందారు :— ఏమిటీ నువ్వుచేయడం గాడిదా — ఊపిరి పీకవడం అసాధ్యంగా ఉంది — ప్రాణం ఊగులాడుతూ ఉంది...అబ్బ...

సేవకుడు :— ప్రభూ ; అరేరేరే ; ఎంతబాగున్నారు — ఉన్నట్టుండి చూస్తే — కొత్త పెండ్లికొడుకులా గున్నారు — మీరు టోపీ తలకు వేసుకుంటేచాలు — ఆ బట్టతల కూడ కనబడదు !

జమీందారు :— సందేహామా రాముడూ — అందుకనే కదూ నేను కాయ కల్పలేహ్యాం తింటూ వచ్చేది...ఊఁ... ఒరే రాముడూ...నేచెప్పింది మరచిపోయ్యావా......

సేవకుడు :— మరచిపోయాను.

జమీందారు :— ఏమీ — మరచిపోయ్యావా — ముష్టి వెధవ — తిండి లేక చస్తావు......

సేవకుడు :— ప్రభూ — అలాచేయకండి. మీఅన్నం కిచ్చేసి — అలా మీరు లేహ్యామే తింటూరండి.

జమీందారు :— ఓరి పాపాత్ముడా — అంతదూరానికి వచ్చావ్ — ఇలాంటి జవాస్లనుంచుకొనే నాసమస్థానాలం-- మునిగి తేలుతున్నాయ్. నీ సిగగొయ్యా, మక్తానద్లు, నాగు-- ఇవ్వాల్సినవాండ్ల వద్ద వసూలు చేసుకొచ్చావాలంటే — మరచి పొయ్యేవా ?

సేవకుడు :— చిత్తం; చిత్తం; వెళ్ళిఅడిగానండి. అయి-- అయితే — వాళ్లేంచెప్పారంటే ; ఏంచెప్పారంటే...

జమీందారు :— శీఘ్రంగా మొరుగు.

సేవకుడు:— ఈసారి వాన్లు లేక పైర్లు ఎండిపోయిందట వచ్చేసారిస్తారట — ఇప్పట్లో వాళ్ళకి తిండేలేదట — మీనగ కొంత వడ్లుతీసుకపోవాలని చెప్పారు.

జమీం :— వాండ్లుచెప్పారు నీవువిన్నావు వచ్చే అంతేకదూ ?

సేవకుడు :— చిత్తం దేవరా !

జమీం :— ఏమంటే ఈయనగారు పెద్దదాత. రై-- మొరవిని హాయిగా హామీఇచ్చి వచ్చినట్లుంది...పోరా, పో-- పోకిరి ముండాకొడుకా ! మీఅబ్బసంపాదించి పెట్టి యుం--

..పెళ్లికి, నాకుమార్తె పెళ్లికి ఎంతవుంది హాజరవుతురు — ఎంత బియ్యము ఖర్చుంది — వీడేంరాంటే అదిచెప్పారు ఇదిచెప్పారని అప్ప జెప్తున్నాడు — ముందు వెళ్లి ఇప్పుడైనా వాళ్ళని పట్టుకురా ......

సేవకుడు :— దేవరా ఒక్కమనవి.

జమీాందారు :— ఏం నీకు చేటుకాలం......

సేవకుడు :— మీా కళంజాలు నిండుగ వడ్లుందికదూ.

జమీాందారు :— ఉంది — నీకేం ?

సేవకుడు :— మరీ......వాటిని ఉపయోగించుకోండి మీా పెళ్ళికి.

జమీాందారు :— ఉపయోగించుకొంటూ, అయితే ?

సేవకుడు :— ( చెయ్యి నలుపుకొంటూ ) మరేంలేదు దేవరా...గవర్నమెంటువారు తిండి కరువని...అందరికీ రేషను పెట్టి సమంగా పంచిపెట్టాలన్నారే...వారు వస్తే—

జమీాందారు :— మీాతాత సంపాదించాడా...వాళ్ళ తాత సంపాదించాడా...నాసొత్తుకు ఎవర్రా వచ్చేది ?—అడిగే వాడ్డిని ?—ఇక తన్నులుతింటావ్—అధికప్రసంగి—ఇంకా ఇక్కడ్నే నిలబడి యున్నావు.

సేవకుడు :— ( చికాకుతో ) నేనక్కడపోతే వాళ్లు చావ తారు. ఇక్కడికొస్తే మీారు డొక్క బద్దలుచేస్తారు. నేను మాధ్యలో ఏలాచావడం, స్వామీా !

జమీాందారు :— ఏమి ఆశ్చర్యం—నాపేరుచెప్తేకూడనా.

సేవకుడు :— ఔనండీ—లక్ష్యపెట్టేదే లేదు.

జమీందారు :— ఆహా ఏమి కాలం — నా పరాక్రమము తెలీదా? — మా పెద్దల పరాక్రమము నీకు తెలీదా? — నాన్న ఎన్ని చిఱుతపులులు చంపినాడో తెలీదా?

సేవకుడు :— చిత్తం! తెలుసండీ! విన్నాను, మా అవ్వ చెప్తుంటే... ఊఁ... మీ తాతగారు కూడా ఆ కాలంలో రాత్రుల్లో అరుస్తున్న నక్కల్నంతా చంపి—నక్కపల్లి అనే గ్రామం కూడా ఏర్పాటు చేశారట.

జమీందారు :— వెధవలు—మా యొక్క పరంపరను కూడా తెలుసుకోలేక యున్నారు... పాఫర్లు — పేదలు—పేదలంట నా ధాన్యం అంతా కాజేసి—నాకు కూడా ఇవ్వనంటారు...ఓ రాముడు, ఏమైనకాని, వాళ్లను పట్టుకరా—లేకున్న పోలీసుకు చెప్పి పంపుతా.

( సేవకుడు వెళ్లును. )

జమీందారు అటూ ఇటూ తిరుగుతూ :— ఇదంత ఈ గవర్నమెంటువారు చేసేపని—జమీందార్లు, జమీందార్లని మా మరాకలంతా మట్టిలో కలిపేశారు—లేకున్న ఈ పకీర్లకి ఇంత పొగరా

( సేవకుడు ఇద్దరు రైతులను పిల్చుకొని వచ్చును. )

సేవకుడు :— ప్రభూ! వీర్లిద్దరే దొంగికారండీ — తీసుకొచ్చాను.

రైతులు:—కామందులవారికి నమస్కారం.

జమీందారు :— ఊఁ! నాకెందుకురా, ఈదొంగదండాలుం. ాసొత్తును మరలా ఇస్తామని ఉద్దేశమే లేకుండా తింటారే, ందుకా ఈదండాలంతా?

రైతులు :— మేమెందుకండీ మీసొత్తు తింటాం?

జమీందారు :— తినకుండా ఏం! మహా యోగ్యులు— ాసొత్తును దోవలో పొర్యేగాడిదలుకూడ తింటూన్నాయ్!

రైతులు :— మన్నించాలండీ! దొర్లచిత్తం మా కులనీడ ారలాకోపిస్తే — మేమెలా జీవించడం?

జమీందారు :— దొగ్లు దొర్లని మాకొంపల్ని కూల్చారే గాలదూ!

రైతులు :— మేమా?

జమీందారు :— మీగ్గాను మీప్రభుత్వం.

రైతులు :— అలా ఏం చేశారండీ?

జమీందారు :— జమీందార్లు, జమీందార్లని జపంచేసి, ాలు ఎగరవేసుకొని మాకనే ఒకచట్టాన్ని అమల్లోకి తెచ్చి ్టేటంతా ఎత్తుకొన్నారే, మీకు సమ్మతమేకదూ...

రైతులు :— దొరవారు కొబ్బడతారు—వాటిల్తో మాకేం ంబంధమండీ ?

జమీందారు :— సంబంధంలేకేం—మీరేకారణం. అలాగే ాివ్వవలసిన బాకీలంతా మీనోట్లో వేసుకోవాలని ఈ వేషాలు వేస్తున్నారు. ఇలాచూడండి—ఇవంతా నావద్ద వ్రు — ముందు నాకివ్వవలసిన బాకీలు నాగువడ్లతోసహా

పైసల్ చేస్తారా - లేక దావాచేసి మీకొంపల్ని, నేలల్ని చేసేదా ?

రైతులు :— ప్రభువులు — చిత్తగించండి - బీదవాళ్లము అల్లాగే మీరు మాపై నెంబర్లు చేయకండీ-మీబాకీలు కొం కొంచెంగా తీర్చేస్తాము — ఈ సారి వానల్లేనందున మీపా లపైబడి అడుక్కొటున్నాం ... వచ్చేభోగంవరకు వాయి దయచేయండి.

జమీందారు :— నేను వాయిదానే ఇన్వనూ - లేదైతే నాకేం ?

రైతులు :— మోకాళ్ళపై పడతామండీ — వచ్చేసంవ రం లోగా మాకుపండే వడ్లంతా మీకే కొల్చేస్తాము. మీ తెలియకుండా మాకు వ్యాపారమూ సాపారమూ ఏముంది — ప్రభూ మాపై కటాక్షించండి.

జమీందారు :— నేనొప్పుకోను — ఐతే ఒకటి — అగ్రి కల్చరల్ రిలీఫ్ ఆక్టని ఒకటి దాపరించింది కావున నాకివ్వవలసిన రొక్కం వడ్డీలతో సహా, వడ్లు, బాకీలు నాగు సహా మొత్తం ఈదినమే రొఖ్ఖంగా పుచ్చుకొన్నట్లు నాకే కట్లు వ్రాసిస్తారా ?

రైతులు :— మాకు చిట్టాలతో పనేముదండి — అలా నేస్తాం—మాకేం తెలుసు—మీ రివ్వాలి—మేంతినాలి. దా గివాలు చేశారంటే మాపొలాలు పొయ్యేదికాక మాప్రాణా పోతవి.

జమీందారు :— సరే రేపు తెల్లవారొచ్చి గుట్టుగా
ట్టులు వ్రాసి యిచ్చిపోండి ఇక వెళ్ళండి.

( రైతులు కుడిపట్టు వెళ్ళేసరికి ఎడమ తట్టునుంచి జమీం
దారు కూతురు శకుంతల Western dress తో చేతిలో ఒక
బ్యాటాడిస్తూ కూనురాగం తీస్తూ ప్రవేశించును. )

జమీందారు :— రావమ్మా... ఇంతసేపా, ఆపాదు చెందు
డుకోడం...

శకుంతల :— లేదునాన్న—ఈ దినం మాలేడీస్ క్లబ్బులో
క పెద్ద మీటింగు "టీపార్టీకూడ జరిగింది" అందుచే కాస్త
లస్యం...

జమీందారు :— ఈ అర్ధరాత్రివరకా ఈగొడవలన్నీ...

శకుంతల :— మరేంలేదునాన్న ! స్త్రీల ఫ్రీడమ్ గురించి
ముఖ్యంగా స్త్రీలు పురుషులవలె ఫ్రీగా తిరుగవచ్చునా తిరుగ
రాడదా అనిన్నీ—పాలిటిక్సులో పాల్గొనవచ్చునా కూడదా
అనిన్నీ—సొసయిటీ స్త్రీలు సినీమారంగంలో చేరవచ్చునా చేర
కూడదా అనన్నీ—మన ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి ముఖ్య పట్ట
బెజవాడలో ఉంటే మేలా బందరులోఉంటే మేలా అనిన్నీ
దినం సాయంత్రం మాసభలో చర్చించి తీర్మానించాము.
సభకు శ్రీమతి S. L. రుక్మిణీదేవి. ఎం. ఏ. గారు అధ్య
వహించారు. నేకూడ ఉపన్యసించితిని.

సేవకుడు :— తల్లీ! ఎప్పుడూ ఈగొడవలేనా ! కాస్సేపై
కృష్ణారామా అనటంలేదా !

శకుంతల :— షటప్! ఇడియట్—నీకేం తెలునురా–ఇవ్వన్నీ లేకే పురుషులు స్త్రీలను దాసులుగాచేసి స్త్రీ స్వాతంత్ర్యమనేది సరస్సులో కలిపేస్తున్నారు.

జమీందారు :- భేష్! భేష్ - విన్నావురా రాముడూ బాగాచెప్పవమ్మా - నాకు కుమారుడు లేడనేకొరతను తీర్చావమ్మా - నావంటి జమీందారుడికి ఇలాంటి నవనాగరికన్నామణి కుమార్తె అనేదానికంటే నాకింకేంకావాలి!

సేవకుడు :— అందుకే కాదూ తామ అమ్మగారిని యఫ్. ఏ. వరకూ చదివించారు!

జమీందారు :— ఔనురా - రాముడూ ......

రాముడు :— అమ్మగారికి తగిన వరుడు ఎవరో?

శకుంతల :— అది నాస్వంతవిషయం. తగినవరుని చూచుకొందునులే - మీకెవరికీ ఆ శ్రమ ఇవ్వను...

రాముడు :— అలాగా!

శకుంతల :— లేకేమిరా... స్త్రీచూచియే ఒకపురుషుణ్ణి ప్రేమించి జీవితసహాయకుడుగా చేసుకోవాలి.

రాముడు :— అయితే ఇలాంటివాడుక ... మన ఉందా...దా...అని......

శకుంతల :— You fool - నీకేంతెలును ... వాడుక మనం వాడుక ఏదిచేసుకుంటే అదేవాడుక - మీ వాడుకంతా కొండెక్కింది–ఇక మా వాడుకే అనుసరణకురావాలి. పురుషులు స్త్రీలను లొంగదీయవలయుననేది ఈకాలంలోచెల్లదు ...

-లంలో స్త్రీ పురుషుడ్ని లోంగదీయబోతుంది ... కాలం
ప్పుడు అడ్డంతిరిగింది - స్త్రీ ఏవిషయములోను పురుషుడికి తీసి
యుంది కాదు - ఇలాంటప్పుడు స్త్రీగొప్పా పురుషుడుగొప్పా
నేట లోకంలో చాటించేదానికే ఎన్నో మహిళాసంఘములు
బయలుదేరి యున్నాయ్.

ఈవిషయమై లెచ్చరిచ్చుటకు నేను మంచి తర్ఫీదైనాను.
ప్రెసిడెంటుగారైన శ్రీమతి హేమలతాదేవి, బి. ఏ. గారు
నాకు "నవనాగరిక కంఠీరవ నారీమణి" అనుబిరుదుకూడా ఒసగి
యున్నారు.

రాముడు :— (నిట్టూర్పు విడుస్తూ)...ఊ......

జమీందారు :— అమ్మాయి ... నీవు మాట్లాడుతూంటే
-కెంతో సంతోష మొస్తుందమ్మా! అయితే, నీవివాహ
-యం ఒక్కటే నాకు పెద్దసమస్యగా ఏర్పడిపోయిందమ్మా
... అదే - నీకు తగిన వరుడు దొరకాలనే......

శకుంతల :— మీరెందుకండీ ఈవిషయంలో కంగారుపడు
న్నారు — ఎవడోఒకడు సర్చిచేసుకుంటూ వస్తాడు.

జమీందారు :—అదేలాగమ్మా — మనంచూడొద్దూ ?

శకుంతల :— (నవ్వుతూ) నీకేంపిచ్చానాన్నా! మొగవాళ్లు
ంటే చచ్చిబ్రతుకుతున్నారు. లేడీస్ వీధివెంబడి పోతుంటే
వాళ్లు వెంటబడేవచ్చి ఇంటివరకు Body guard లాగు విడిచి
య్యేవాళ్లెంతమంది ! మొగవాడు ఎంతఅవసరమై పోతూం
-కే దోవలో ఓ ఆడది తప్పనిసరిగా .ఒక్క సైట్ వేస్తే

చాలు వాడక్కడ్నే స్తంభంలాగు నిలబడి రెప్ప - చూస్తూ వచ్చినపని వంకలో కలిపేసేవా ళ్ళెంతమంది, ఆడ రైల్లో ప్రయాణంచేసినాసరే, బస్సులో ఎక్కినాసరే సీటులేద కొంఅ తేలేదు - పురుషులు పోటీ పైన వేసుకొని వాం ములో కూర్చోమంటారు. అలా రైలెక్కిన లేక బస్సెకి ఆడది కూర్చోను సీటిచ్చాడే అను కృతజ్ఞత తెలుపుటకై సిగ్గు చూస్తే చాలు అంతే అక్కడ్నుంచి వాడు ఆ ఆవిడ పోవల స్టేషనువరకూ టిక్కెట్టు లేకవచ్చి టిక్కెట్ కలెక్టరువద్ద బిక మొఖము పెట్టుకొన్నవా ళ్ళెంత మంది! (నవ్వుతూ) ఏంనాన స్త్రీకి పురుషుడు కావలె ననే చింతపడువారు మిమ్మొక్క చూచుచున్నాను.

జమీందారు :— ఉండొచ్చు; కానీ; నావిష కూడ నువ్వు కొంచెం గమనించ వద్దా...నే...ఓ... పెండ్లి చేసుకోవాలిగా!

శకుంతల :- Oh yes It is your will and pleasu I am not standing in your way నేవద్దన్నా

జమీందారు :— అందుకాదు శకుంతల...మనం తావు ఎలాంటిదో వెళ్ళిచూచి ముహూర్తం పెట్టుకురావమా

శకుంతల :— Certainly — అలాగే పోదాం.

జమీందారు :— ఆఁ......... మణలూరు గ్రామ కారి వెంకట్రావు కుమారుడు రత్నం...... నువ్వెప్పు చూశావో లేదోమరి.— అతను మంచి రూపవంతుడు —

౦ – ఇప్పుడే బి. ఏ. ప్యాసయ్యేడుకూడాను – నువ్వుకూడా
ంతో వచ్చి అతన్ని చూస్తే బాగుంటుంది – మంచి సంబం
౦...... నీకు నచ్చితే అతన్నే పెండ్లి చేసుకోవచ్చు.

రాముడు :— అగత్యం అమ్మగారు పోవలసిందేను. అమ్మ
ారి చదువుకున్న – అయ్యగారి చదువుకున్న—అరే—అరే –
కేముంది మంచి జోడీలు.

శకుంతల :— (ఆలోచించి) అలాగా – నాకు తెలీదే –
ప్పుడు జరీన్న పెట్టుకొన్నారు ?

జమీంం :— నీవు సరేనంటే రేపే......మనం వస్తున్నా
ని జాబు కూడా వ్రాసి యున్నాను.

శకుంతల :— నా Consent లేకనా నేకూడ వస్తానని
ాశేరు...... సరే very good – ప్రయాణానికి సిద్ధంగా
ంటా !

జమీంం :— ఇదిగో నే కాస్త బయటికెళ్లొస్తా – నువ్వు
ంచేసి పడుకో. (జమీందారు చేతి కఱ్ఱతో వెళ్లును)

శకుంతల :— ఒరే రాముడు, ఈ బూట్సును బ్యాటును
త్తిపెట్టు – రేపు ప్రయాణానికి నా Dress లు, నా సో్న
ాటిల్ – హేరాయిల్ – ఫేస్‌క్రీమ్ – నా లిప్‌స్టిక్, మిరర్,
ంబ్ ఇవన్నీ నా పెద్ద ట్రంకులో ఉంచి రెడీగా ఉండు.

ాముడు :— రెడీగా ఉంచుతా – నేనూ మీతో......

శకుంతల :— నువ్వెందుకురా – పిల్లిని చంకలో పెట్టుకొని
ళ్ళినట్లు— Useless country broot – కానీ చూద్దాం...
నీ పని చూడు.

శకుంతల :— (స్వగతం) ఏమి ప్రపంచం - స్త్రీల రైట్సు నా బోటివాళ్లే ఫార్వర్డుకు తేకపోతే స్త్రీలగతి ఏమయ్యేది - నాకు తగినభర్త ఉన్నట్లైతే మేమిద్దరంకలిసి ఈలాటివాట్లు ఎంత పాటుపడవచ్చును? మ్యారేజనే దొకటుంది మనలో. దాన్నెందుకు త్రోసి పెట్టాలి? శీఘ్రంలోనే ముగించి వేయడం. కూడా ఒక బర్డన్ తీరిన ట్లుంటుంది.

రేపే ప్రయాణం. అయితే, నాకెన్నో ఎంగేజ్ మెంట్సు ఉన్నాయి — ఏలాచేయడం? ఊఁ......ఉంటేనేమి — రెండు రోజులేగా — కేన్సిల్ చేస్తే పోతుంది — ఒక Excuse లెటరు కూడా ప్రెసిడెంటుగారికి పంపించేస్తే పోతుంది.

శకుంతల: పాటపాడి ముగిస్తూ లోపలికి వెళ్లును.

(తెర మూయబడును)

---

# మూడవ అంకము

## 19 వ రంగము

[స్థలం: మణలూరు - గ్రామాధికారి ఇల్లు — తిన్నెపై గ్రామాధికారి-చంద్రు-రామయ్య-శేషయ్య—కుర్చీలపై జమీందారు — శకుంతల — లక్ష్మి తలుపువద్ద యుండును. అందరు తాంబూలం వేసుకొనుచుందురు.]

రామయ్య :— (జమీందారుతో) రైలుబండి లేటుగా వచ్చినట్లుంది—వేళతప్పినదే భోంచేశారు—ప్రయాణపు బడలిక—కాస్సేపు పడుకొంటారా?

జమీందారు :— దానికేం...పడుకొంటే పోతుంది—మే మాదినమే బయలుదేరిపోవాలి — మాకు — అనేకమైన పన్లు—కావున—వచ్చినపని—ఇప్పుడే మాట్లాడుకొంటే రేపు ఉదయం వండికి మేము వెళ్ళొచ్చు.

రామయ్య :—అలాగే చేయండీ...మరి ఈ అమ్మాయేనా కూతురు...

శకుంతల :— (లేచి) యస్. నేనే (అని కరస్పర్శ చేసుకొను బోయి రామయ్య చేతులు ఇవ్వనందున A Country fruit, అంటూ కూర్చొనును.)

రామయ్య :— మంచిది — మంచిది — అలానేకూర్చోండి — నామధేయం...

శకుంతల :— మిస్ శకుంతల.

రామయ్య :— (ఆశ్చర్యం) బలే మంచిపేరు...మిస్ అం ఏమండీ ఇప్పుడెన్ని మార్లు అమ్మాయిగారు మిస్ అయినారండి?

శకుంతల :— నాన్ సెన్సు, మిస్ అంటే పెండ్లి గానివా రను అర్థము.

రాము :— అదా! నాకేం తెలుసండి, ఆ ఇంగ్లీషుభాష, మిస్ అంటే అదేదో చదువు ప్యాసవడం అనుకొన్నానండీ. అయితే జమీాందారుగారికి రత్నం విషయం తెలిసే వుంటుంద అనుకొంటా.

జమీాందారు :—ఏం...అతను—లేనివిషయం చూస్తూ ఉన్నానుగా.

రామయ్య :— మరేంలేదు...తండ్రిపై అలిగి కొన్ని రోజులు ఎక్కడికో పోయినాడు.

జమీాందారు :—దానికేం—అది ఎక్కడా సహజమే—కొన్ని రోజులు అలాఉండి మళ్ళీవస్తాడు...మనం ఇంతలో ఒక మంచి దినంగాచూసి ముహూర్తం పెట్టుకుంటే—తర్వాత జరుగవలసి వెన్నో ఉందికదూ...

శకుంతల :—నో...నో...అబ్సర్డు...నేను మొట్టమొద ఆయన్ని చూచితీరాలి.

రామయ్య :— ఓహో...ఔను మరి.

గ్రామాధి :— ఏమిటండీ ఇదంతా! నాకేమో దేహ సౌకర్యంలేదు—జబ్బుగాయున్నాను—కాస్తనాకు దేహం కుదిరి తర్వాత ఆలోచిద్దాం —.

జమీాం:— జబ్బుకున్ను, పెళ్లికిన్ని ఏమండి సంబంధం? ారేం చేయనక్కరలేదు—మీారు నెమ్మదిగా యుండండి. మీా త్తొందరున్ను తేక మేమే చూచుకొంటాము.

రామయ్య:— అలాఅనకండీ. దేహం కొంచం స్వస్థమైతే న్నిటికీ బాగుంటుంది.

గ్రామాధి:— మన్నించండి జమీాందారుగారూ - కొన్ని రోజులు నిదానించండి.

జమీాం:— ( ఉన్నట్టుండి ) ఏదీ మీాకుమార్తె సుందరం— చూడాలి.

శకుంతల:— నేనుకూడా చూడాలి.

గ్రామాధి:— ఎందుకండీ — ఇంట్లో ఏదో పనిగా ఉంది.

జమీాం:— ఏనండి చూడ్డం తప్పా?

గ్రామాధి:— అబ్బే తప్పని కాదు — ఇంట్లో పనిగా -ని చెప్పా.

రామయ్య:— వెంకట్రావుగారు — పిలిస్తేనేం! పిలవండీ.

గ్రామాధి:— అమ్మాయ్ — సుందరం — అమ్మాయ్!

సుందరమ్మ:— ఏం నాన్న!

గ్రామాధికారి:— ఇలా వచ్చి పో.

సుందరమ్మ:— ఇదిగో వస్తున్నా.

( సుందరమ్మ తలుపుమరుగులో నిలువగా, జమీాందారుడు వస్త్రులు ఆభరణములు సర్దుకొని తొంగి తొంగి చూస్తూండును)

శకుంతల:— ఇలారా సుందరం ( కుర్చీచూపి ) టేక్ యువర్ సీట్.

సుందరం :— ఊహుఁ — నేనిక్కడే ఉంటా.

శకుంతల :— ఏం! సిగ్గా! ఏంసిగ్గు! మగవాళ్ళంటే ఆ వాళ్ళ కింత పైపై ఏమిటీ, వాళ్ళూమనవలె మనుష్యులేగా! ఆకాశంనుండేమి దిగలేదు — ఈలారా.

సుందరం :— ఊ...హుఁ... నేరాను ఇలానే ఉంటా

జమీం :— ఈ పిల్లని చదువులోవేసి నలుగురితో తిరగనిచ్చి యుంటేగా — అందులోను పల్లెటూరు పడుచు

శకుంతల :— నిజమే. ఈనవనాగరిక కాలంలో ఈఇంట ఇంకా పాతపంచాంగం వెలిగిపోతూఉందే! కారణమేమిటు

లక్ష్మి :— కారణమా? మేము సంసారరీత్యా కాలమ గడిపేవారము.

శకుంతల :— అయితే మీరు సంసారులును, మేము ముండలమూనా?

లక్ష్మి :— మీ రొకటి, మరొకటిగా అర్థంచేసుకొం మీకొచ్చిన విద్యనంతా చూపిస్తున్నారు — ఈలాంటిసంబం మాకొద్దు — నాముద్దులతల్లి, నువ్వు మాఇంటికొస్తే, — కిం కేమి కొదవే యుండదు.

శకుంతల :— మీలాంటి ఓల్డు హ్యాగ్సులతో సంబం చేయ వచ్చింది మాతప్పు.

జమీందారు :— ఆగు...ఆగు...

శకుంతల :— ఏంనాన్న, ఎంత insult — చేసిందో — చూశేరా — ఇలాంటి ప్లేసెస్‌లోనా — నాజీవితాన్ని చేయ చూచారు?

గ్రామాధి :— కైదా — ఇదేంగొడవ — నాకుండే కష్టం -లదనా ?

లక్ష్మి :— మీకింతేకాదు — ఇంకా కావాలి — నామాట -రింటేగా — ఈముసలిపెండ్లికుమారున కింకా పడుచు — ఈ -మ్మాయిగారికొక భర్త — బాగుంది మీఆటలు — మీరే ఈ సంబంధంచేసుకోండి — నే నే నుయ్యో గొయ్యో చూచు కొంటాను.

రామయ్య :— అవసరపడకమ్మా - వచ్చింది అనుభవించేగా -రాలి !

చంద్రు :— (కోపముతో లేచి, గ్రామాధికారితో) ఇదం -యు మీపనేగా — అప్పుడే వీళ్లకొకజాబువ్రాసి పారేసుంటే తదూరం ఎందుకు పెరుగుతుంది ఈగొడవలన్నీ — మీరే -లుగజేసుకొన్నారు - మీరే బాధపడండి...

శకుంతల :— అలాచెప్పండి.

గ్రామా :— ఏమిట్రా నీగొడవ - నువ్వుజాబు వ్రాస్తే నే -ద్దన్నానా?

చంద్రు :— మీరు చెప్పియుంటేగా - నేను ముందుగా -ాయమనిచెప్పి యుంటే నాపై భగ్గున మండిపడియుందురు — మీకు నాపైకోపమువచ్చినా పరవాలేదు - మీఆచారాన్ని అడంపెట్టుకొని రత్నాన్ని ఒకదోవ చేసిందీకాక అమాయకు -లైన సుదరం జీవితంకూడా పాడుచేయించినారు — ఈజమీం -ారువల్ల ఏమీ తప్పులేదు ... ఎంత ముసలివాడైనా ముచ్చ

హైన ముదితను వద్దంటాడా ? డబ్బే ఆధారంగాపెట్టుకొని ఈ కాలంలో, ఎందరో- ఎన్నో, అన్యాయాలు చేస్తున్నారు (జమీందారుని చూచి) చూడండి జమీందారుగారూ, ఇటువంటి బలాత్కారపు సన్నివేశాలకు పూనుకొంటే కడకు మీకుదొరికేది విగతజీవియైన సుందరంయొక్క భౌతికశరీరమే గాని మరేమైనా కలదా ?

శేషయ్య :— (శకుంతలనుచూచి) ఈపిట్టనివట్టినవ్యక్తి ఎవరు ? ఇలాసిగ్గులేకుండా నడుస్తుందే! దీనికేమి అడ్డంకులేలేవా

శకుంతల :— (శేషయ్యను) షట్అప్ నోరుమూయ్! మునీశ్వరుడులాగు కూర్చొని మాట్లాడుతూ వున్నావే!

శేషయ్య :— అబ్బో! ఎంతమాటనింది! దీని ఇం మాసిపోను!

జమీందారు :—ఏమిటీగొడవ - మర్యాదనేదే శూన్యం ఉందే ...

గ్రామాధి :— మీవద్దనా! మావద్దనా... మంచి రును సంపాయించావయ్యా నీవు.

శకుంతల :— ఏమో నీకూతురువలె, వచ్చేడు పనుమా రూపాయంత కుంకం... పెట్టుకొని... ఒక అక్షరంకూడా వ్రాట్నా నేను ?

లక్ష్మి :— ఇక ఆగు ... మాటలు తిన్నగారానీ !

శకుంతల :— మనిషిని చూచిమాట్లాడు. జాగ్ర ఎవరనుకున్నావ్ ... పిచ్చిదానా...

లక్ష్మి :— నేనా పిచ్చిదానను ? ఇప్పుడు తిన్నగా ఇంట్లో నుంచి వెళతావా, గెంటించమంటావా ?

శకుంతల :— నిన్ను పోలీసుల కప్పజెపుతాను - విలేజి బ్రూటు–కళ్లు నెత్తికొచ్చి పేల్తున్నావు డామిట్ ! ఇక నోరు తెరిస్తే గూబ పగులగొడ్తాను.

జమీంా :— (కుర్చీనుంచిలేచి) I see ఇదా మీమర్యాద! మంచిది; ఈవేళతో నేననుకొన్న సంబంధం తెగిపోయింది; వెళ్ళుతా.

గ్రామాధి :— శని వదలింది.

జమీంా :— నిన్నింతటితో వదుల్తానా? మూడు ఊర్లు తిప్పి, మూడు చెరువుల నీళ్లూ త్రాగించి ... కడకు సముద్ర స్నానం చేయిస్తా.

రామయ్య :— అలాగా బాబు ! నీదయ ఉండాలి.

గ్రామాధి :— ఏమిటి విపరీతం; దెయ్యాలాడేలాగ ఆడేస పోతున్నారే !

లక్ష్మి :— దెయ్యమా— ఆ నంగనాచిని తెచ్చి పెట్టుకోవల ననుకున్నారే?

గ్రామాధి :— నాకేం తెలుసు, అదేమిటో మంచి మనిషి అని భ్రమించాను. దీనిదుంప తెగా — తుదకిది ఒక కిరస్తానిదిగా ందే !

లక్ష్మి :— మీకేం తెలుసు ? ఇప్పుడు తెలియవచ్చిందిగా! వాళ్లు కిరస్తానం అని ... సిగపాయితీసి తందునుగాని ఇది సమయంకాదని ఊరుకొన్నా.

రామయ్య :— ఇక చాలించండీ... ఆ వెధవముండా గ్లీషు కూతలు నాకేం అర్థం కావటంలేదు ; గాని నాకు యుంటే దాన్ని చితకొట్టి మరోపని చూశేవాడను... సంస తంగాని ఆపె మాట్లాడియుంటే నేను మంచినీళ్ళప్రాయ కాయించేసియుంటా.

శేషయ్య :— అమ్మగారు – ఆకిరస్తాని మాటలు క కమ్మా, వెంకట్రావుగారు ... అన్నీ కడుపులో వేసుకో

గ్రామాధి :— ఏమిటండీ అల్లకల్లోలంగా ఉంది కొంపలో. తగిలిన కాలే తగుల్తుంది. అన్నీ మాటసరిపో నాకుండే దేహస్థితివల్ల ఇంకా కొన్నిరోజులు ఉంటానో అని నాకే సందేహంగావుంది – రత్నమూ కనపడకపోవ నాకు వాణ్ణిచూసే ప్రాప్తి లేసట్టుంది – దీని కెవరేమి చేయ

రామయ్య :— మీరు చెప్పేది వాస్తవమేనండి. రత అంత సులభంగా దొరికేటట్టు నాకేమీ తోచలేదు; అతను దొరకాలి ... సుందరానికి పెండ్లీ కావాలి –

గ్రామాధి :— ఏ తీర్మానానికి రమ్మంటారు నన్ను ?

రామయ్య :— మీరు రత్నం వచ్చువరకూ వేచివుం తమ దేహస్థితినిబట్టి అంతగా ఉచితం గాదు – మీ ఈడేరవలెనంటే మీరు మీకుమార్తె పెండ్లి ముగించేయవ

గ్రామా :— ఔను. మంచిదే - వరుడూ ?

లక్ష్మి :— వరుడులేకేం! మీకు డబ్బే ప్రధానం; సుంద మెమో ఇష్టపడియుంది; రత్నానికికూడా అదేకోరిక; అయి తే

వాడేమో బీదవాడే. అయితేనేం—మనకెంతమంది కొడుకు లున్నారు, మన ఆస్తికి, ఉండేది ఒక్కే కొడుకు, ఒక్కే కూతు గా - మన చంద్రుకేఇచ్చి పెండ్లిచేసి ఎందుకు మనఇంట్లోనే పెట్టుకోకూడదు ?

గ్రామాధి :— శ్రమలేక దగ్గర్నే వెదుక్కొన్నావే! ఊం - శాస్త్రం అలావుంటే - సరే అట్లే కానిమ్మ - రామయ్యగారూ, రు ఏఁవంటారండి ?

రామయ్య :— నే నేంచెప్పడం...మీరందరు ఇష్టపడితే సరె...ఆనాడు తల్లో వ్రాసింది జరిగే తీరాలిగా...చంద్రుడేమి ; చువున్నవాడే ; అయితే సుందరాన్ని ఒక మాట అడిగిన ాగుంటుందేమో ! అదియుగాక ఊరంతా ఒకేమాట !

గ్రామాధి :— ఏఁవిటదీ !

రామయ్య :— అదే - చంద్రుకున్నూ మీ అమ్మాయికిన్ని కో స్నేహమని.

గ్రామాధి :— చూడండీ, మరేంచూడక ఈప్రకారం — నిద్దరూ పెళ్ళిచేసేస్తాను — అవు డేమంటారో చూద్దాం — ద్రు మనకులంవాడేగా.

రామయ్య :— అదే నేచెప్పడంకూడాను — ఎందుకున్నూ తకం సరిపోవద్దూ ?

గ్రామాధి :— ఎందుకున్నూ, అసలు సుందరాన్ని కను ండాం. (అమ్మాయ్ అని సుందరాన్ని పిలుస్తాడు.)

సుందరం :— ఏం నాన్నా. ?

గ్రామాధి :— ఇప్పుడు మేంమాట్లాడ్తుండడం నీకు తెల

సుందరం :— కానిస్తారూ నాన్న గారూ.

గ్రామాధి :— అదికాదమ్మ ; నీకు సమ్మతమేనా అంట

సుందరం :— (మౌనంతో నిలబడును.)

లక్ష్మి :— ఇదేంటీ ప్రశ్నలు...సమ్మతం ఉండడంబ గదా చెప్పాను.

గ్రామాధి :— అదేవిటే — అతగాడ్దూ ; జాతకం చూడొద్దూ ?

లక్ష్మి :— మీారు అలాగే నన్ను పెండ్లి చేసుకున్నట్టుంటే జాతకం పంపించి ఏమార్చారేం — మీాదా ఆ జాతకం ?

గ్రామాధి :— సరే, సరే...అక్కడికే చాలించు.

రామయ్య :— ఈవేళ బాగా లేదండీ. రేపు తెల్లవా జాతకం చూస్తాం.

గ్రామాధి :— అదీ మంచిదే.

రామయ్య :— మరీ, మే మెళ్లొస్తాం — రేపు తెలవా కలుసుకొందాం (అందరు వెళ్ళుదురు).

( తెర మూాయబడును. )

# 20 వ రంగము

[ ప్రవేశం: గ్రామాధికారి, చంద్రు మొ... ]

గ్రామాధి :— చంద్రూ నీజాతకం ఉందా !

చంద్రు :— లేదండీ.

రామయ్య :— బ్రాహ్మణుడుగా పుట్టి జాతకం లేదంటా వెుట్రా.

చంద్రు :— ఇప్పుడేమి ... ఒకటి తయారు చేసుకుంటే పోతుంది.

రామయ్య :— అట్లాం ప్రారబ్ధం !

చంద్రు :— నేనా బీద బ్రాహ్మణ్ణి — నా నిజజాతక చూపిస్తే పిల్లనిస్తారా — మనజాతిలో ఇది పరిపాటేగా — ళ్ళెళ్ళకు పంపించిన జాతకంలో ఏదైన ఒకటి నిజం ఉంటుందా ?

రామయ్య :— చూశారా, వెంకట్రావుగారూ ! నాలుగు ఇంగ్లీషుముక్కలు నేర్చుకునేటప్పటికి మనజాతి రహస్య మంతా ధుల్లో పారేస్తున్నారు.

చంద్రు :— నే నలా ఏం చేయలేదండి — నిజంగా నాకు జాతక మే వ్రాయలేదు.

గ్రామాధి :— పోనిస్తురు బాబూ... నామధేయం అనుస రించి చూడడమే.

రామయ్య :— మీరు నాపై కోపబడ్డారనే — ఇటువం శ్రీరంగనీతులు నేర్చే శాస్త్రాళ్ళను నేను చూడను...ఇం శేషయ్యానుచూడమనండి (చంద్రమును శేషయ్యాపరికించిచూచును

శేషయ్య :— (తనలో) వేవిట్రా ఈ కర్మ, ఎరా చిక్కుడ్డాను...వీడికి మంచిగా చెప్పి వదువవలెనే.

చంద్రు:— ఆయన జోస్యంలో నిపుణుడని వినియున్నాను దీన్ని చూడలేక పోతే, ఊరంతా ఎట్లా ఆయనదగ్గ ముహూ.. పెట్టుకు పోతారూ?

శేషయ్య :— (తనలో) పట్టింగిరా గ్రహం! ఇక చూ పోతే తంతాడుకాబోలు! అసలే మనకీ వాడికీ కాదు.

చంద్రు :— చెప్పరేం, సంస్కృత పండితులమని — కొంటారే!

రామయ్య :— చూశారా! ఈ కుర్రాడు మా పరువు కానీకికూడ మతింపులేక చేస్తున్నాడు.

చంద్రు :— వేవిటండి మీగోతాలు?

గ్రామాధి :— అబ్బాయ్ చంద్రూ, నీవూరుకో, మీ.. చెప్పండీ శేషయ్యగారు — సుందరం, జాతకం తెచ్చావా

లక్ష్మి :—ఇదిగోనండి.

గ్రామాధి :—పుచ్చుకోండి శేషయ్యగారు.

శేషయ్య :—పంచాంగంకూడా లేదే.

చంద్రు :—మీకెందుకండీ పంచాంగం. మీబుర్రే ఒక పంచాంగంకట్ట.

శేషయ్య :—(తనలో, చచ్చాౡ్రాతండ్రీ ఏడిశాడు లెగ. ఇక ఏటూ చెప్పితీరాలి - లేకున్న ఒక లెక్చర్ కావలసినంత చేస్తాడు.) ఇదిగో చూస్తాన్రా అబ్బాయి.

(కాగితం కొంత సేపు చూచి)

ఆఁ...పిల్ల పేరు సుందరం, పిల్లవాని పేరు చంద్రు. చూచ-[illegible]తభిమం — పిల్లి పుట్టిన తేదీ నెల సంవత్సరం ఉంది — అబ్బాయ్, నీవేసంవత్సరంలో పుట్టావు. తేదీ నెలతో సహా ......

చంద్రు :— నేనా ! నైంతు మే నైన్టీన్ హండ్రెడ్ ట్వెంటీ ఫైవ్ (Ninth May Ninteen hundred and twenty five)

శేషయ్య :— (తనలో) ఓరి నీ దుంపతెగా తెనుగు [illegible] చెప్పబ్బాయ్-మంచిసమయంలో కూడానా ఆ కిరస్తానీమాటలు!

చంద్రు :— కిరస్తానిమాటలా [illegible] — గంధర్వభాష [illegible] గంధర్వభాష ?

గ్రామాధికారి —ఆలస్యమవుతుంది — చంద్రునా, తెను[illegible] తో చెప్పవేం !

చంద్రు :—తొమ్మిదవ తేదీ మేనెల వెయ్యిన్నీ తొమ్మిది[illegible] ఇరువై యైదు.

శేషయ్య :— అనుకుంటూ, సరే కలియుగాది 5051, శాలి—వాహన శకాబ్దం 1872, విక్రమశకాబ్దం 2006, ఫసలీ 1358—[illegible], ఇంగిలీషు 1925— ప్రభవ, విభవ, ధాతు, ఈశ్వర, బహుధాన్య, ప్రమాధి, విక్రమ (చంద్రునిజూస్తూ చెయ్యిచూపిస్తూ)-

విరోధి, రాక్షస, నళ, పింగళ, సిద్ధార్థి (చంద్రునివంక చూసి దుర్మఖి, సుందిభి, క్రోధన (చంద్రుని ఆశ్చర్యముతో శేషయ్యను చూచి కలఆశించుసప్పటికి) అక్షయ, అక్షయనామ సంవత్సరం (చంద్రునిచూసి) సద్గ్రహానికి రాజు బుధుడు, మంత్రి శని, ఆరోగ్యాధిపతి చంద్రుడు. వృషభలగ్నం ఇద్దరికి పొంతనం బాగుండును. ఐతే గోచారఫలం బాగులేదు. దానికేం.

చంద్రు :—ఏమన్నారూ...

శేషయ్య :—చాల బాగుందండి - ఈఫాల్గునినెల శుక్లపక్ష అష్టమితిథి...

గ్రామాధి :—ఏమీ — తిథి అష్టమియా?

శేషయ్య :—లేదు, పొరపాటుగా చెప్పాను - సప్తమితిథి రోహిణీనక్షత్రం - మీనలగ్నమందు, శుక్రవారం తెల్లజామున నాలుగునండి అయిదున్నరలోపల ముహూర్తానికి బాగుంది. జరిపేయవచ్చు.

చంద్రు :—Thanks సరిగ్గాచెప్పారండీ.

శేషయ్య :—(తనలో) బతికాన్రా దేవుడా, లేకున్న స్తానం కోతిముండాకొడుకు నన్ను చచ్చేదాక ప్రాణాలు విడువడు.

గ్రామాధి :—మంచిది; ఆముహూర్తమే పెట్టుకుం (చంద్రుడు చిటినవ్వుతో సుందరమ్మవంక జూచును. సుందరమ్మ ... చంద్రునిచూస్తూ ఇంటిలోపలికెళ్లును.)

[అందరు లేచివెళ్లుదురు. తెరమూయబడును.

# 21 వ రంగము

(పెండ్లిఅయిన వధూవరులకు మంగళహారతి జరుగును.)

మంగళులు హారతితీస్తూ పాటపాడుదురు. వధూవరులు మాలలు మార్చుకొందురు.

(తెరమూయబడును.)

# 22 వ రంగము

[స్థలం: మదరాసు...జీవన్ ప్రభాత్ కంపెనీ]

మేనేజరు:— Mr. రత్నం, అమెరికాకు ఆర్డర్ ఇచ్చా ది ఏమైంది?

రత్నం:— ఆ సామానులింకను దిగుమతి కాలేదండి Sterling devaluation కారణముచే.

మేనేజరు:— మనం కొన్ని ముఖ్యమైన సామానులకు యిటు దేశాల్ని ఎగుమతిచెయ్యడం వల్లనేగా ఈ విపత్తంతా.

రత్నం:— ఇకమీదట మనమే అన్నివస్తువులు చేసుకోగలుగుతాం.

మేనేజరు:— ఏకాలానికో! అసలుబాగా దొరుకుతూవచ్చే చక్కెరకుకూడా ఉన్నట్టుండి కరువొచ్చింది.

రత్నం:— ఏంచేయడంమరి! ఇవన్నియు ఈ బ్లాక్ మార్కెట్లవారి లీలావినోదమేగా!

మేనేజరు :— ఉత్సవ అధికంగాయుంటే బ్లాక్ మార్కెట్టుకు చోటెక్కువుంటుంది ?

రత్నం :— అందుకేగా జవహరలాల్ నెహ్రూగారుకూడా అమెరికాకు వెళ్ళొచ్చింది! ఇక ఏవస్తువులూ మనకు కొఱత ఉండుటకు గవర్నమెంటు అన్నివిధముల సన్నాహాలు చేసారు

మేనేజరు :— "ఫ్యాన్" ఈ Invitation Cards అందరికి అందింవూ!

( ఫ్యాన్ కార్డులుచేతపట్టుకొని నిలువబడి యుండును.

మేనేజరు :— ఏరాస్కాల్, స్తంభముపలె నిలిచియున్నావు నేనేంచెప్పింది ?

ఫ్యాన్ :— మీరు చెప్పింది ఈ కార్డులు అందరికివ్వమని.

మేనేజరు :— మరెందుకు అచ్చటనే నిలబడియున్నావు ?

ఫ్యాన్ :— కొన్నికార్డులేగాఉంది! అందరికివ్వ సరిపోవునాయని ఆలోచిస్తున్నా.

మేనేజరు :— అందరికీ సరిపోవూ ఆకార్డులు !

ఫ్యాన్ :— అదెలాగండీ !

మేనేజరు — ఏంరా నీకు హాస్యోకాలం ?

ఫ్యాన్ :— మరేంలేదండీ. అందరి కిమ్మన్నారే-అందరికీ నాకు తెలసినవారు దాదాపు వెయ్యమందున్నారే అని.

మేనేజరు :— ఛీ! పిచ్చికుంక-అందరికి అంటే-ఇక్కడున్నవారందరికీయని అర్థం-కార్డులో ఏ మచ్చు వేసిఉందో దాన్ని కాస్తా చదివిపడు.

(ఫ్యాన్ కార్డును చదువుతూవచ్చి, ప్లీస్ బ్రింగ్ యువర్ కేషన్సు విత్ యు, అనిచదువును)

మేనేజరు :— ఇప్పుడర్థం తెలసిందా రేషన్ విషయం —

(ఫ్యాన్ తల ఆడించును)

మేనేజరు :— ఇవి తెలియదునీకు—25మందికిపైఒకపార్టీలో ంచేస్తే ఎంగిలిఆకులన్నంతా వర్పించి కేసువేయించి జుల్మానా స్తారు—నీకెక్కడున్నంచి తెలుస్తుందీ! బ్లాక్ మార్కెట్ బియ్యం కదూ నీవృత్తి నేది ?

ఫ్యాన్ :— అవునండి! మా కూడా అదేగా నే తీసు చ్చేది.

మేనేజరు :— పట్ అప్ యువర్ లెస్ బ్రూట్—  చదువు చెప్పందానికే నాకు సరిపోతుంది—నిన్ను డిస్ మి— చేస్తానుండు.

రత్నం :— నిస్తురండీ—వాడి ం తెలుసు—కంట్రవాడేగా

(ఫ్యాన్ కార్డులు అందరికీ ఇచ్చును.)

మేనేజర్ :— అందరూ తప్పక సతీపతులతో వాడి న్నర్ తోకూడ డ్యాన్సుకూడ ఏర్పాటు చేసియునా

రత్నం :— Thank you very much ఈగృహప్రవే ంఅయిన వెంటనే భగవదనుగ్రహామువల్ల మరియొక గృహాము రాడా మీరు నిర్మింపవచ్చును We wish yow all success.

మేనేజర్ :— Very good మీయొక్క సహాయుండుంటే లాగే చేయగలగుతాను. మీరుమాత్రం తప్పక సతీపతులతో

రత్నం :— Thanks, అలాగే.

మేనేజర్ :— అందరూ తప్పక రావాలి. Miss not.

( అందరు లేచి వెళ్లుదురు ) ( తెరమూయబడును.)

## 23 వ రం గ ము

[మేనేజరు గృహాం — అందరకి ఆహ్వానంజరుగును - రత్న.
కాంచన ఓత్తట్టునూర్చుని యుందురు. డ్యాన్సుజరుగును. మే
జరు కాంచనను గమనించుచుండును.]

—: డ్యాన్సు అయినతర్వాత :—

మేనేజరు :— సోదర సోదరీ మణులారా! నాఇంట
ప్రవేశము అనుసరించి ఏర్పాటు చేయబడిన విందుకు మీార
విచ్చేసి నన్ను గౌరవించినందుకు నే నెంతయు కృతజ్ఞుడను.
ఎదుట డ్యాన్సుచేసి మనల్ను ఆనందింపజేసిన ఈ నారీ
శ్రీమతి కమలకుమారి అని మీాకందరికే కాదు, ఈ ఇండియా
అంతా ఆమెపేరు తెలియని వారులేరు. ఈమెకు తీరుబాటు
లేదు. ఈమె కెన్నో ఎంగేజిమెంట్సు ఉండినప్పటికి — నారికోర్కెను
త్రోసివేయక సందర్భానుసారములో ఆడవలసిన నాట్యమును
కేన్సిలు చేస్తూ మనకుగాను ఈభరత నాట్యమును ప్రదర్శి
సాటిలేని కీర్తిని సంపాదించుకొన్న ఈ నారీమణి
కాలంలోనే ఇంగ్లాండు మొదలు Western Countri...

ఇక ముఖమండలమా చంద్రుడే లజ్జపడేలాగ అనిపిస్తూ వుంది ఆ అభినేత్రియొక్క దర్శనము పాపవిమోచనము.

మేనే:— Certainly అందేమి సందేహము? కాని ఆమె అప్టుడేటుగా లేదు. ఆమె సౌందర్యమునకు తగిన నాగరికత గాని భూషణములుగాని లేవు... ఆపిల్లని ఎక్కడనుంచి తీసుక వచ్చియుంటాడు. విధిలేక ఆమె, వాడివద్ద ఉండేటట్టు ఊహించుచున్నాను. ఆమెకు కొంచం లక్ష్మీకటాక్షం ప్రయోగించిన ట్లైతే మీ అండ కప్పక చేరుతుంది — ఈకాలం— డబ్బుకు అసాధ్యమయినది ఉందా?

మేనే:— Very good. — నేనే రత్నం లేనప్పుడు వెళ్లి ప్రయత్నించెద. నాకోరిక నిక్కముగ సమకూరును- వేయి అనేది, రెండువేలంటే వేగంగా పనవుతుంది.

(తెర మూయబడును)

# 24 వ రంగము

[స్థలం: రత్నంఇల్లు — మేనేజరు తలుపుకొట్టును]

మేనేజరు:— ఎవరింట్లో—ఏమండోయ్... తలుపు.

కాంచన:— ఎవరూ?

మేనేజరు:— నేనే—జీవన్ ప్రభాత్ కంపెనీ మేనేజరును. తలుపు తెరవండి.

కాంచన :— ఆయన లేరండి ఇంట్లో.

మేనేజరు :— సరే, మీతో ఓమాటుంది.

కాంచన :— (తలుపు తెరుస్తూ) ఏం! విశేషం...మీరా! (సిగ్గుతో తలవాలుస్తూ) ఎవరో అనుకొన్నాను. రండి —

( మేనేజరు లోపలికి వెళ్లి కుర్చీపై కూర్చుండును. )

కాంచన :— ఆయన ఇప్పుడే ఆఫీసుకెళ్ళారే !

మేనేజరు :— ఉండొచ్చు—అయితే నేఆఫీసుకు వెళ్ళకుండా తీరుగా ఇక్కడికే వస్తున్నా—ఆఁ...మీఊరు చాలాదూరమా?

కాంచన :— అబ్బే! సమీపంగానే ఉందండీ.

మేనేజరు :— మీ పేరేమిటో !

కాంచన :— నాపేరా...ఎందుకూ? — కాంచన.

మేనేజరు :— అందమైన పేరు. మీ అందానికి తగినట్లు కాంచనమాల అని పేరుంటే బాగుండేది—అతనికి తెలిస్తేగా — కు పెళ్ళి...

కాంచన :— మీ కెందుకండీ—వాటినిగూర్చి.

మేనేజరు :— ఏం! నాకేమనిఅడుగుతావా—నిన్ను గాకెంతవిచారమో తెలుసా—నీకు తగిన ఇల్లా ఇది, నీసౌందర్యానికి తగినచీరా ఇది, నీఅందానికి తగిన ఆభరణాలా ఇవి? నీకు దాపరించిన దౌర్భాగ్యాన్ని పోగొట్టడం కోసంమే వచ్చాను.

కాంచన :— ఏమిటండీ ఈమాటలు! నన్ను కట్టుకొన్నవారు రక్షించగలరు—మీరేం కంగారుపడవలసినది లేదు.

మేనేజరు :— నిజమే కావచ్చు — కానీ — కాంచనమాలా నీమనస్సుకష్టపడకూడదని నాఉద్దేశము. చూడూ, నాలో అంద లేదా? నాసామర్థ్యం నీకు తెలియదా? నాసంపాదన నీకు యదా? మరెందుకు నాపై సిచికునవ్వును ప్రసరింపవు? (అంట లేచి దగ్గరకెళ్ళి) "ఏదీ! ఒక్కసారి నవ్వు! నన్నొక్కసారి ము పెట్టుకోనీ"... నన్నీగాఢాంధకారమైన దారిద్రమునుండి విడ ఒక పెద్ద బంగళాలో పెట్టి — నిన్ను పూజింతును.

కాంచన :— ఆగండి అక్కడితో! మీ పెద్దమనిషి తరహ తెలిసింది — కేవలం కామాంధకారుడవై మీ మానము దలు గోలుపోవద్దు. మీబంగాళానద్దు. గింగాళానద్దు అవి మీ యుండనీ — ఈడబ్బునల్లేకదూ మీకింత పొగరు — మీలాంటి పుణ్యపురుషులకు సంపదయిచ్చి చల్లగ చూస్తున్నాడే సర్వే రుడు — అతనికి తెలిసి ఉన్నదా అని!

మేనేజరు :— ఆహా — సొగసుకత్తెల కోపంకూడా శృంగారమే — సర్వేశ్వరుడికి బుద్ధివుండే ఈకోమలాంగిపై తెరచాడు — అందుకే నే వచ్చాను. (అని ముట్టును)

కాంచన :— ఇక మీమాటలు కట్టిపెట్టండి — మర్యా వెళ్ళుదురా? లేక చీపురుకట్టతో శాంతి కావాలా?

మేనేజరు :— వృథాగా చెడిపోవద్దు — నీ మంచికోసం చెబుతున్నా — నామాట విను — నాసంగతి నీకు తెలియద

కాంచన :— నీసంగతి తెలిసే ఈశాంతిని చెప్త.

మేనేజరు :— ఎంత గర్వం నీకు – ఇదంతయు నేనిచ్చే జీతం దూ! నా డ్నిప్పుడే డిస్ మిస్ చేస్తా.

కాంచన :— పీడవదిలింది – నీఉద్యోగము చేసి బ్రతుకుట ంటె భిక్షమెత్తుట నయం.

మేనేజరు :— అదీచూస్తాగా! (అని వెళ్ళిపోవును)

[రత్నం ప్రవేశించును]

రత్నం :— కాంచనా! ఈనాడు నీమోములో ఏదో ఆందోళన కనిపిస్తోంది! చంద్రబింబములో కళలు తగ్గినట్లుంది – ారణ మేమిటో చెప్పవూ!

కాంచన :— ఏమీలేదు. ఈ ఊరువదలి పోవుట తప్ప ఇక ణమైనను ఉండిన, మన కాపదలు తప్ప, సంపదలు రావు.

రత్నం :— ఏమిచెప్పవ్ ? ఏమిటి ఈగోల ?

కాంచన :— గో లేమిటి – మంచివాడు మంచివా డని చెప్పా రే—ఆ మేనేజ రే దానికి కారణం ?

రత్నం :— ఏమీ – మాకంపెనీ మేనేజరా ?

కాంచన :— ఆ మార్జాలమే!

రత్నం :— ఇక్కడ కొచ్చా డేమిటి – ఏం చేశాడు ?

కాంచన :— చేసే దేముందీ – నాపాతివ్రత్యమును చెరప ంచాడు.

రత్నం :— ( నిట్టూర్పు విడిచి ) దైవమా, గోరుచుట్టుపై టిపోటా ? బీదవారికి తావేలేదా ? కాంచనా! ని న్నేమైన ంనాడా ఆదుర్మాత్ముడు—చెప్పు—మానం పోయినపిదప ప్రాణ ాద్దుకు – ఇప్పుడే వాణ్ణి బుర్ర పగులగొట్టెదను.

కాంచన :— ఓం......అంతదూరం రానిస్తానా - వా-
తప్పించుకొని పొయ్యేలోపల తాతలు దిగివచ్చారు.

రత్నం :— ఓరి మార్కీచుడా! నీకు డబ్బున్నదనికదూ
గర్వం, కామం! ఆడజ్న్మే ఒకసర్పముగా మారి నీగొంతునుచుట్టు
కోకుండపోదు! మామంటలు నిన్ను దహించకపోవు! పగలు కాల
చక్రమును నిలుప ఎవరితరము—ఈ రోజుల్లో పరిహసించువా
రేవు గౌరవింతురు—అదృష్టం ఎవరిస్వంతమూ కాదు—కాంచనా.
వాని ఉద్యోగంనుండి ఈదినం మానుకొంటాను. నీ వాయా
పడకు. శీఘ్రంలోనే మనవూరికి వెళ్ళుదము.

(తెర మూయబడును.)

## 25 వ రంగము

[స్థలం : మణలూరుసత్రం—జోస్యునివద్దకు వీరుడు సామా
నులు తెచ్చిపెట్టును.]

వీరుడు :— సరిపోయిందా — ఇక జరిపించండి.

( జోస్యుడు అన్నిసామానులు చక్కబెట్టుకొంటూ వీరుని
ఎదుట కూర్చోమని )

జోస్యుడు :— శుక్లాంబరధరం విష్ణుం, శశివర్ణం, శాంతనౌః

ఓం. గణపతి యానమః

ఓం. ముకుందాయనమః

ఓం. కాళికాయనమః

ఓం. కర్మమాయనమః

ఓం. మోస మాయనమః

ఓం. ఏమాం దయానమః

ఓం. చోణగిరి యానమః

ఓం. నెల్లవేళ యానమః

ఓం. అల్లాం ఇరుక్కారదా యనమః

ఓం. ఎళ్ళుం బెళ్ళుం ఇరుక్కిరదా యనమః

ఓం. తేంగా ఇరుక్కిరదా యనమః

ఓం. ఇంద రేషణ కాలత్తిలే యనమః

ఓం. అరిచి ఇరుక్కిరదా యనమః

దక్షిణె — దక్షిణ — ఎంగేదక్షిణై ?

వీరుడు :— ఇదిగో పెట్టుతున్నాను అని రెండురూపాయలు ెట్టును.

జోస్యుడు :— స్వాహా అరిచిస్వాహా! తాంబూలం ్వాహా, తేంగాస్వాహా, దక్షిణేస్వాహా.

ఓం, హ్రీం, గ్రీం, గ్రూం, శ్రూం, శక్తి, భక్తి, ముక్తి లి, చూలి, మారి, మహామ్మారి, శాకినీ, డాకినీ, యక్షిణి, ామనీ, మోహిని, భూత, పిశాచి, కుట్టిచ్చాత్తాన్ భళి, భళి, -, గుడు గుడు గుడు ఓడు ఓడు — ఆం

( ఇంతలో జోస్యునికి ఆవేశం వచ్చినట్లు ఆడుతూ )

జోస్యుడు :— హేయ్, కవీకరా, కనే, కనా, కరు కతె -, కను, కనా, కమూ కర్థ

వీరుడు :— అయ్యో నాకు తెల్లేదే, మహేశ్వరీ నీవు నన్ను కాపాడాలి.

జోన్స్యాడు :— హేంగ్ - నానే మహామ్మారి - మహేశ్వ కమూకడక ఆ కహాకతంకష్లు క తెక ష్లే.

వీరుడు :— బుద్ధి, బుద్ధి, బుద్ధి! ఎన్నాళ్ళకు కళ్లు తెర— వమ్మా, మాయమ్మ - జగదాంబా, నీ న్నెనాడైనను మరచ యుందునా-నన్నెందుకు ఇలాశోధిస్తున్నావు-నేనే మపరాధము చేసితి - నాకూతురిని నావద్దకు జేర్చవా ?

జోన్స్యాడు :— ఊం(హూం(, కచే, కర్చ, కను.

వీరుడు :— మహేశ్వరీ, మీ బాప. ఏంటో నాకు తెల్లే తెలుసుకొనునట్లు అనుగ్రహించాలి.

జోన్స్యాడు :— ఆహా, అపరాధం - మాదిఅఖిలాండభా దేవతులు పేచెందు - మన్నిచ్చేన్ - తెలుంగే పేసరేన్.

వీరుడు :— కలితార్థుడనైతిని - నాకూతురు ...

జోన్స్యాడు :— నోర్ మూయ్ - నీతప్పు తెరియుమా ?

వీరుడు :— తప్పా నేనేంచేయాలేదే !

జోన్స్యాడు :— చేయలిగా - అదే - నాకొకసారి రా— పాట్లేలు కొట్టనియా - గట్టిగా కొట్టనియా.

వీరుడు :— అంబా మన్నింపుము. ఈనెల్లో తప్పక పా— కొట్టుతాను - నాకూతురుని శీఘ్రంలో చూచునట్లు (గ్రహించాలి.

జోస్యుడు :— ఊం - హుం - రేపే కొట్టాలి - నాభక్తు
న జోస్యునుక్క తలతప్ప మిగతఅప్పడి యేపొట్లలు ఇచ్చేయ్.

వీరుడు :— అలాగేచేస్తా.

జోస్యుడు :— అట్టె! ఊం... మరవకుండా చేస్తావు?

వీరుడు :— తప్పకుండా చేస్తాను - నాకూతురు ...

జోస్యుడు :— ఊం — ఇందసంవత్సరత్తిలే, ఇందమాసం
డాల్లే, బుధక్కిళమిలే ఒరుమనిషి వరువాళ్, ఇల్లే ఊం కుం
తిరియేవరువా — ఊం హ్రైం అయింది, సమయపురం పోనుం —
మలెవర్రేన్, కర్పూరం, కర్పూరం.

(వీరుడు కర్పూరం ముట్టి చేతిలో పడవేయును. దానిని
జోస్యుడు నోటిలో వేసుకొని మంత్రిస్తుతూ పడిపోవును.)

(తెరమూయబడును.)

# 6 వ రంగము

[ స్థలం : కోవూరుసత్రం—వీరుడు ఒకమూల కూర్చుండును.
బిడ్డలు నిద్రించుచుందురు. సుబ్బయ్యపాటపాడుతూ వచ్చును. ]

సుబ్బయ్య :—చూడని చోటులేదు — తిరగని జాగాలేదు.
ఒడుగెత్తు నా చెప్పుకూడ అరిగిపోయింది—పొద్దేమోఅయింది.
ఇడనే కూర్చుంటా (అని ఒకమూల కూర్చుండును. తరువాత
ఆమూల వీరుడున్నది గ్రహించి,)

ఓరి నీపుణ్యానా ఇక్కడున్నావ్ — నేనంతా తిరిగి, తిరిగి ఆపాళ్ళ నీవు చచ్చిపొయ్యావనికదూ అనుకొన్నా, అమ్మా గ్రామదేవతా మొగిలీశ్వరమ్మా నీకు మొక్కుతా— నేవచ్చిండే. ఏటకొడతా — యీరయ్యా మంచినీళ్ళ పానకంవలె దొరికావయ్యా — నువ్వేకదూయీరయ్యా (అంటూ దగ్గరకుపోవును)

వీరుడు :— ఇక్కడకూడా వచ్చేవ్ — ఇంకా నన్నేమి చేయనున్నావు ?

సుబ్బయ్య :—చేసేదేముంది యీరయా — నాకదువు చల్లబడింది — నీకేం అపాయంరాదు — మాఅయ్యే నిన్నుపిల్చుకరమ్మన్నారు.

వీరుడు :— మీ ఊరికొచ్చి నాకూతురుని దారబోసుకొనిందికాక నామానంకూడ పొయ్యింది. ఇంకెందుకయ్యా నన్ను రమ్మంటారు.

సుబ్బయ్య :— నీవల్ల తప్పేం ? మగాడిదే—అందు ఆడదానిదేంకాదు — అంచేత జరిగిందేదో జరిగింది—ఇంక అవేంది మాట్లాడడం నీకూతుర్ని కంటితో చూచేదిగాఉంటే నాతో కూడరా — లేకపోతే నే ఎల్లతా ! ( అని లేచును. )

విరుడు :— ఆగు, ఆగు. నాకూతుర్ని చూపిస్తావా ? నీ తేని పుణ్యాం ఉంటుంది —

సుబ్బయ్య :— మరి — రా — ఎల్లతాం.

( అందరువెళ్ళుదురు )

# 27 వ రంగము

[స్థలము: పోలీసుస్టేషన్. C. 3. సబ్ ఇనస్పెక్టరు — ...ందరు కానిస్టేబిల్సుండుదురు. కంపెనీమేనేజరు ప్రవేశించును.]

మేనేజర్ :— Good morning Sir.

సబ్ ఇనస్పెక్టర్ :— హలో! ఏమిటీ ఇంతదూరం? క్షేమంగా ?

మేనేజర్ :— విశేషంలేకనా! ఇదిగో ఈ రిపోర్టు చూడండి- అన్నీ విశదమవుతుంది.

(అని కాగితాన్ని అందించును)

సబ్ ఇనస్పెక్టరు చదువును.

మ. రా. రా. శ్రీ మదరాస్ సి. టి. పోలీసు సబ్ ఇన-స్పెక్టరువారి దివ్యసముఖమునకు —

జీవన్‌ప్రభాత్ కంపెనీ మేనేజరైన రాఘవరావువ్రాసుకొన్న ...పోర్టు ఏమంటే :-

మాకంపెనీలో బొక్కసదారుడుగా పనిచేస్తూయుండిన త్నం 4-.-50 తేదీ నాయుంతరము సుమారు 5000 లకు దొంగి ంచుకొని పరారిఅవుటకు సిద్ధంగాయున్నాడు. కామందుల ..కు తక్షణమే రత్నంఇంటికివెళ్ళి అరస్టుచేసినట్లయితే పైకము ..రుకును. లేకున్న రత్నం అనువాడు పరారిఅయిపోవును. తనియొక్క అడ్రసు — నెం 14. సున్నివీధి, తిరువల్లిక్కేణి.

చిత్తగించకర్తలు

ఇట్లు, రాఘవరావు

జీవన్‌ప్రభాత్ కంపెనీ మేనేజరు.

Sub Inspector :— అలాగా ! Oh my God ! అతను ఇప్పుడు ఇంట్లో దొరకగలడా ?

మేనేజర్ :— దొరకును-త్వరపడండి - యు ప్లీజ్ హెల్పుమి.

సబ్ :— ఏయ్, 107, 124, 346 బేడీలు తీసుకరండి —. వాట్ సార్ ఇకపోదాముఁరండి.

కా :— (ఒకశాల్యూట్ కొట్టి) బేడీలు తెచ్చాను. (మేనేజరును చూపించి) ఇతనికి వెయ్యమంటారా ?

సబ్ :—ఫూల్ - ఇతనికా వెయ్యమంటిని - ఈడియట్, గాజులు వేసుకొనవాడు మరియొకచోటఉన్నాడు రా పోదాం..

మేనేజరు :—ఏఁవండిసార్, ఏలాటి మనుష్యులయినది మీజవాన్లు తెలుసుకోలేరు.

సబ్ :— వాడికేం తెలుసండి — Kindly excuse పోదాంరండి.

(సబ్ ఇనస్పెక్టరు, జవానులు, మేనేజరు వెళ్లుదురు.)

(తెరమూయబడును.)

## 28 వరంగము

[స్థలం : రత్నంయిల్లు - సబ్ ఇనస్పెక్టర్ - జవానులు - మేనేజరు ప్రవేశింతురు. రత్నం, కాంచన ప్రయాణానికి మూటలు మొదలగునవి కట్టుచుందురు.]

సబ్ :— హాలో మిస్టర్ రత్నం నీమరదృష్టం - సమయానికే మేము వచ్చేశాం.

రత్నం :— ఏఁవండీ మీరు చెప్పేది, ఏం విశేషం ?

సబ్ :— విశేషమా – తెలుస్తుందిలే. ఏయ్ 107, 124 వాడికి బేడీలు తగిలించండి - గవర్నమెంటు కన్నమూసుకొనా ఉంది.

రత్నం :— ఊఁ, అర్థమైంది - మేనేజరుగారు – మీవద్ద ఇంతవరకు ఉద్యోగం చేసిందానికి ఈబహుమానమా ?

మేనేజర్ :— నోరుముయ్ – అంతా తర్వాత తెలుస్తుంది.

రత్నం :— అవును. తర్వాతనే తెలుస్తుంది, నీలంచగొండితనం - నీపతనంకూడా...

కాంచన :— ఇదేం అన్యాయం - (మేనేజరును చూచి) నీకుసిగ్గులేదు - ఈపనికికూడా దిగావు.

సబ్ ఇనస్పెక్టరు —: ఏయ్ 107, ఏం నిలడియున్నావ్ ? పదండి స్టేషనుకు.

రత్నం :— సబ్ ఇనస్పెక్టర్ సార్; కొంచెం దయచేయండి- నేనిరపరాధిని; అధమపక్షం ఒక జాబు వ్రాసేందుకైన అవకాశ మివ్వండి. మీకు పుణ్యం ఉంటుంది.

మేనేజర్ —: ఊఁ హుఁ – అవకాశ మిచ్చేందుకు కాదు.

రత్నం :— నిన్ను కాదు – ఇన్సుపెక్టర్ గారిని అడుక్కొంటున్నాను.

సబ్ ఇనస్పెక్టర్ :— (మానేజరుతో) ఉండండిసార్, బంధువులకి వ్రాసుకొంటాడేము. లెట్ హిమ్ రైట్, Why do

you worry పోనీపాపం ; (రత్నం కేసిచూసి) ఊఁ కానిమ్ము. హారియప్ — ఓన్లీ టు మినిట్స్ అలౌడ్.

రత్నం :— థాంక్సు ; అలాగే.

(రత్నం జాబువ్రాసి పోస్టుచేయమని కాంచన చేతికిచ్చును.)

కాంచన :— అయ్యో ఈ పాపిష్టివల్లనేగదూ — మీరింత కష్టపడవలసి వచ్చింది — మీరుండవలసిన చోట్లో ఉంటే ఇంకను నేడూపిరితో యున్నానే, ఈకర్మమంతా చూడ్డానికి (అని ఏడుస్తూ క్రిందపడిపోవును.)

సబ్ :— హూఁ. అయిందా — పద స్టేషనుకు.

(అందరు వెళ్ళుదురు)

తె ర మూ య బ డు ను.

## 29 వ రం గ ము

[స్థలం : మణలూరు గ్రామాధికారి ఇంట్లోనిగది. చంద్రు— సుందరమ్మ మంచంపై కూర్చుని యుందురు.]

చంద్రు :— మీఅన్నయ్య వెళ్ళి ఎన్నిమాసములైంది. వాని వృత్తాంతమే నాకు తెలియలేదే - అతనుంటే మనం ఇలాఉండడం చూచి ఎంత ఆనందపడేవాడో — అవును మనం యిచ్చి పెట్టుకోలేదు.

సుం:— : నేనుకోరిన విషయము పూర్తిఅయినది కాని..

చం :— నీవు కోరినదింకను పూర్తి కాలేదు ! ఆహా ; ఏమి దైవఘటన !

సుం :— చింతించకండీ ! త్వరలో మా అన్నయ్య వస్తాడు - రాత్రి నాకల్లో కూడ వచ్చాడు—నాకల ఫలిస్తుంది; చూడండిమరి !

చం :— ఎన్నాళ్ళు చూడడం, సుందరం ! నీవు కూడ లేకున్న, రత్నంపై నాకుండిన ప్రేమకు ఈ వరకు యేమై యుండునో దైవమునకెఱుక.........................

సుం :— నాదుఃఖం తీరునట్లు ఒక పాటపాడెదరా ! కాస్త హాయిగా వింటాను.

సుం :— ఊం హు ! మీరే పాడండి.

చం—: నీకు నాట్యం నేర్పించియుండలేదు.

సుం :— కొద్దిగ నేకదూ.

చం :— అదేచాలు ! నువ్వు నాట్యం చేసేదిగాయుంటే నేపాటపాడతాను.

సుం :— నాకు సిగ్గుగావుంది మీరుపాడండి ముదట.

చం :— అట్లైతే నే పడుకుంటా.

సుం :— ఊహు వద్దు—నే నాట్యం చేస్తా కానీండి.

చం :— అయితే మీనాన్న వచ్చేవేళకదూ; ఇపుడు.

సుం :— భయంలేదుబావా - మనకీ యింట్లోఉన్న స్వాతంత్రం మరెక్కడా వుండదు.

చం :— అవును, వాస్తవమే, పుట్టినింటో వుండకపోతే మెట్టినింట్లో ఉంటుందా ?

సుందరం :— అదేమండి అక్కడమాత్రం — నా మంచిని గ్రహించితే ఈస్వతంత్రతం సిద్ధించదూ ?

చంద్రు :— ఎవరు లేదన్నారు ? కాని ఆమేఘాల్లోంచి మనలతొంగిచూచి నవ్వే ఆచంద్రుడ్ని చూడు, ఏలావున్నాడో.

సుంద :— ఆచంద్రుణ్ణి చూడ్డం ఎందుకు—ఈ చంద్రుడునా ప్రక్కనుంటే ! ఏదీ, మీరు పాట పాడెద నన్నారే ! పాడండి.

చంద్రు :— నాట్యం చేసేందుకు సిద్ధంగా ఉన్నావా ?

సుంద :— ఊం రెడీ.

[ఆనడంతో పోష్టుమేన్ ప్రవేశించును]

తపాలువాడు :— వెంకట్రావుగారున్నారండీ ?

చంద్రు :— ఇలా యిమ్ము.

(తపాలువాడు కవరు అందించును)

చంద్రు :— అబ్బా, ఎన్నాళ్ళకి, రత్నం, నీచేతివ్రాత చూడ కలిగాను—సుందరం, మీఅన్నయ్య లెటరిది. (తనలో) లెటరు చదువుకుంటూ, అయ్యో చేతికందింది నోటికందలేదే మీఅన్నయ్య అరెస్టు చేయబడినాడట — మీనాన్న ఏడీ ?

సుంద :— ఇదిగో పిలుచుకొస్తాను.

[వెంకట్రావు, లక్ష్మి మొదలగువారు ప్రవేశింతురు.]

చంద్రు :— రత్నాన్ని అరెస్టుచేసారంట, మదరాసులో ఇదిగో జాబువచ్చింది.

గ్రామాధి :— అయ్యో నాయనా, నీకేం కష్టం వచ్చిందా

లక్ష్మి :— నా కన్నకడుపుకాలా, నాబిడ్డ ఏమి కుమిలి పోతున్నాడోకదా.

రామయ్య :— ఇలా ఏడుస్తుంటే యేం ప్రయోజనం వెళ్ళండి త్వరగా.

గ్రామాధి :— (శేషయ్యతో) మీరుకూడా రండి, వ్యవహారం తెలిసినవాళ్లు.

చంద్రు :— ఆయనెందుకండీ, మంచి బారిష్టరుగా చూచి పెట్టాలి, ఈయన సలహా ఆయనేమీ యెత్తుకోడు.

రామయ్య :— అలా అనకండు బాబు; ముందు జమీందారీ కాలంలో శేషయ్య తహశీల్ చేసినవాడు, వ్యవహారశాలి.

చంద్రు :— సరే పదండి ఈబండికే.

సుంద :— నేకూడ వస్తాను.

చంద్రు :— నీవెందుకు ?

[ఇంతలో సుబ్బయ్యయు, వీరుడున్ను ప్రవేశింతురు]

రామయ్య :— ఇదిగో మనసుబ్బయ్య, వీరుడ్ని పిలుచుకు వచ్చాడు.

గ్రామాధికారి :— ఏడుస్తూ—అయ్యా వీరయ్యా,నారత్నం గతి విన్నావా — అరెస్టుచేశారట.

వీరుడు :— కాంచన ఏమైంది ?

చంద్రు :— ఏమీ కాలేదు. అక్కడ్నే మదరాసులో ఉంది— ఇక ఆలస్యం చేయకండి.

గ్రామాధి :— బండి పిలవండి.

( అందరు వెళ్లుదురు. )

( తెర మూయబడును; )

# 30 వ రంగము

[స్థలము : మేజిస్ట్రేటుకోర్టు.]

( ప్యూన్ :— (గేటువద్ద నిలబడి) సైలేన్సు ........ మేజస్ట్రేటు ప్రవేశించి ఆసనముపై కూర్చుండును )

కోర్టుక్లార్కు :... అర్జీలు.

జవాను :— అర్జీలు, అర్జీలు, అర్జీలూ .....

( అందరు అర్జీలు మొదలగునవి దాఖల్ చేస్తురు )

క్లార్కు :— C. C. No. 134 of 49- మాల చిన్నగా-

జవాను :— చిన్నగాడు—మాలచిన్నగాడు— హాజర్ లేడు

మేజిస్ట్రేటు :— వారంటు 20—10—49.

క్లార్కు :— C. C. No. 152 of 49 పెనుగంటి, వీరబద్రయ్య ...

జవాను:— వీరబద్రయ్య—వీరబద్రయ్య—వీరబద్రయ్యా-

ఒకవక్కీలు :— (లేచి అర్జీయిస్తూ) యువర్ హానర్ స్మాల్ కాస్ కోర్టులో కేసున్నది. 2. P. M. వరకు వాయిదా ఇవ్వండి.

మేజిస్ట్రేటు :— తీరుబాటులేని వక్కీళ్లు, కేసులెందు కోర్టులో దాఖలు చేయవలె ?

వకీలు :— యువర్ హానర్, మీ ప్రెడిసెసర్లు, ఆలా వాయిదా ఇచ్చేవారు.

మేజి :— I am sorry నేనలాకాదు—వాయిదాఇవ్వను. ప్రొసీడాన్ విత్ ది కేస్ (Proceed on with the case)

వక్కీలు :— I request your honour to reconsider my request, as this is the first time.

మేజి :— ఈ వక్కీళ్ళతో పెద్దపోరాటం అయిపోయిందే మాకు, alright next sunday పెట్టుకొంటూరా ?

వకీలు :— Sunday holiday గదా ... యని ... అదియుగాక నాకు బయటూరు సబ్ మేజిస్ట్రేటు కోర్టులో ఒక ఎంగేజ్ మెంటుఉంది – రేపు తెల్లవారి 8 గంటలకు తాము యచేయాలి.

మేజి :— ఇక మాకు Sundays లో కూడ తీరుబాటు లేదు – ప్రతిదినం తెల్లవాళ్లూకూడspecial కోర్టులా !

గ్రామాధికారి :— ( శేషయ్యతో ) ఏమండోయ్, ఈ మేజి ట్రేటు చాల కోపగాడు కాబోలు !

శేషయ్య :— కోర్టువార్ల సంగతిఅలాగేఉంటుంది—కోపంగా ండే అధికార్ల వద్దనే కనికరంఉంటుంది – నాఅనుభవ మది. ట్టిగా) చూడ్డురుకాని ...

మేజి :— ఉస్ ! ఎవరా మాట్లాడుతున్న మనిషి ?

బారిష్టర్ (లేచి) :— యువర్ హానర్, ఆయన మణలూరు గ్రహారం కాపురస్థుడు – పేరు శేషయ్యశాస్త్రులు.

మేజి :— What is he talking about ?

బ్యారిష్టర్ :— యువర్ హానర్, ఆయన, నే, appearఅయ్యే accused తండ్రికి friend; ఇంతకుముందు, సమస్థానంలో తహశీల్ దారుగా యున్న వారు—accussed తండ్రికి సలహా ఇస్తు న్నారు కాబోలు! ( శేషయ్యతో ) నెమ్మదిగాఉండండిమీరు.

మేజి :— You are here to advise ; So ask h to be quiet.

బంట్రోతు :— ( శేషయ్యను చూచి ) ఏయ్, శా ఇచ్చట గల్లంతు చేయవద్దు. కోర్టువారికి కోపమువచ్చి బై పంపుదురు.

శేషయ్య :— ( తనలో ) ఓరినీపాడగట్ట, నీకేంరా వచ్చింది పొయ్యేకాలం (అంటూలేచి కోర్టువారితో) "మన్నించాలండి"

క్లార్కు :— C. C. NO. 161 OF 49 పారనేని పరమేశం, దొడ్ల రాముడు.

ప్యూన్ :— హాజర్.

( ఇద్దరు కానిస్టేబిల్సు ఇద్దరిని పట్టుకొచ్చి కోర్టు ముందు నిలుపుదురు )

మేజిస్ట్రేటు :— మీరు గవర్న మెంటువారి prohebition పాలసీని ఉల్లంఘించి సారాయి కాచి త్రాగినందువల్ల ఒక్కరికి మూడునెలలు కఠినశిక్ష విధించినాం — Next.

క్లార్కు :— C. C. NO. 134 OF49 — రత్నం.

జవాను :— హాజర్.

మేజి :— Is any body appearing for defence

బ్యారిష్టరు :— Yes your honour, I am filing akalat.

(వకాలత్తునామా గుమాస్తాకు అందించగా, గుమాస్తా కోర్టువారికి అందించును.)

మేనే:— Alright, proceed on with the case, who is the complaint? get him into the box.

కోర్టుజవాన్ :— (మేనేజరుతో) చెప్పండి! దేవుని ఎదుట.

మేనేజరు :— దేవుని ఎదుట.

జవాను :— ప్రమాణముచేసి.

మేనేజరు :— ప్రమాణముచేసి.

జవాన్ :— నిజం చెబుతాను.

మేనేజరు :— నిజం చెబుతాను.

జవాను :— అబద్ధం చెప్పేదిలేదు.

మేనేజరు :— అబద్ధం చెప్పేదిలేదు.

మేజిస్ట్రేటు :— యస్. Next—

పబ్లిక్ ప్రాసిక్యూటరు :— మీ పేరేమి ?

మేనేజరు :— నా పేరు రాఘవరావు.

ప. ప్రా :— మీరే కంపెనీకి మేనేజరు ?

మేనేజరు :— నేను జీవన్‌చందు ప్రభాత్ కంపెనీకి.

కోర్టుజవాన్ :— సైలేన్స్.

ప. ప్రా :— మీ కంపెనీలో రత్నం అనువాడు - ఇదిగో నే Cashierగా ఉంటూ వచ్చాడా ?

రాఘవరావు :— ఔను. నెల 18 వంద రూపాయల జీతంలో కాషియరుగా నుండిన దితడే.

ప. ప్రా :— తర్వాత ఏమిజరిగింది ?

రాఘవ :— 29-9-49ని, నేను కంపెనీలో లేని సమయ[redacted] చూచి తనవద్ద నమ్మకంగా యుంచబడిన ఐదు వేల రూపాయల దొంగిలించుకొని పారిపోవుటకు సిద్ధంగా యున్నప్పుడు నేను పోలీసుకు report యిచ్చాను.

బ్యారిష్టర్ :— ఎన్నిగంటలకు ఆఫీసు వదలినాడు అనేది కావాలి !

మేజిస్ట్రేటు :— ( ప. ప్రా. ను చూచి ) అడగండిసార్ !

ప. ప్రా. Unnecessary, your honour అడగ వలె యుంటే It is open for him to cross examine.

బ్యారిష్టర్ :— No, your honour, it is not admissible according to evidence Act.

మేజిస్ట్రేటు :— (బారిష్టరుతో ) మీరు క్రాసులో అడగండి

బ్యారిష్టరు :— Yes, your honour, but the Cour can put the question.

ప. ప్రా :— Your honour, it is indecent your honour. Cross-examinationచేయుటకు defence chance ఉన్నప్పుడు the Court cannot waste th time.

మేజిస్ట్రేటు :— It is all unnecessary – మంచిదిగా ఉంటేనుసరే, చెడ్డదిగాయుంటేనుసరే అబ్ జెక్టుచేసేది ఈ కేసుకు వాడుకగా పోయింది.

బ్యారిష్టరు :— Yes, your honour – నేను ప్రెస్ చేయ ను. I withdraw my objection.

మేజిస్ట్రేటు :— ఇందుకా ఇంతసేవు, Next witness Sub Inspector, the Investigating Officer

(కోర్టుజవాన్ సబ్ ఇన్స్పెక్టరును ప్రమాణము చేయించును.)

ప. ప్రా :— మీరేనా పోలీసుస్టేషనుకు Sub Inspector?

సబ్. ఇ :— C. 3.

ప. ప్రా — రాఘవరావు complaint ఇచ్చిందే మీ రేంచేశారు.

సబ్. ఇ :— వెంటనే spotకు వెళ్ళి accused ను పట్టి arrest చేశాను.

ప. ప్రా :— That's all your honour.

మేజిస్ట్రేటు :— (Accused రత్నంతో) సాక్షులు చెప్పింది విన్నావా?

రత్నం :— విన్నాను.

మేజిస్ట్రేటు :— ఈసాక్షులు చెప్పినమేరకు నీపై Criminal Procedure code 324, 126 Sections క్రింద నేరము మోపబడినది. తప్పు ఒప్పుకుంటావా?

రత్నం :— నేను తప్పుచేయలేదండి.

మేజిస్ట్రేటు :— నీకు సాక్షులు ఉన్నారా?

రత్నం :— ఉన్నారు.

మేజిస్ట్రేటు :— Alright. ప్రాసిక్యూషన్, సాక్షులను క్రాస్ చేస్తావా?

బ్యారిస్టరు :— Yes, your honour. I have already submitted that I am appearing for the accused.

మేజిస్ట్రేటు :— Yes go on.

బ్యారిస్టరు :— (రాఘవరావుతో) ఏమండీ Mr. రాఘవరావ్ – మీరేనా రాఘవరావు?

మేజిస్ట్రేటు :— What all these things ఏవైనా Points ఉంటే అడగండి సార్.

బ్యారిస్టరు :— Yes your honour, మీరు షాపు కాపలాదారుడుగా రత్నాన్ని ఉంచుకొన్నారే అతనివద్ద ఏమైన cash security తీసుకొన్నారా?

రాఘవరావు :— లేదు.

బ్యారిస్టరు :— ఏమి? ఎందుకూ?

(రాఘవరావు మిందకరించును)

బ్యారిస్టరు :— అతనిపై నమ్మకం ఉండేకదూ!

రాఘవరావు :— ఔను! అయితే.........

బ్యారిస్టరు :— ఊఁ – హూఁ అయితే గియితే వద్దు. అడిగిన వరకు జవాబు చెప్పాలి.

ప. ప్రా :— This is unnecessary your honou..

బ్యారిస్టరు :— This is absolutely neccessary our honour for defence.

మేజిస్ట్రేటు :— Yes - go on.

బ్యారిస్టరు :— మీకు బ్యాంకులో 28 – 9 – 49 తేదీన cash ఎంత నిలువ ఉందండి ?

రాఘవరావు :— నాకు జ్ఞాపకంలేదు.

బ్యారిస్టరు :— ప్రతి దినం కంపెనీనుంచి బ్యాంకులో డిపాజిట్టు చేస్తారా ?

రాఘవరావు :— ఔను.

బ్యారిస్టరు :— 29 – 9 – 49 తేదీ కూడ డిపాజిట్టు చేశారా ?

రాఘవరావు :— జ్ఞాపకం లేదు.

బ్యారిస్టరు :— సరి, పోని, ఈ ఐదు వేల రూ॥ చోరీపోయిన వని చెప్పారే అది ఎక్కడ నుండి వచ్చింది – దాని కేమైనా ఆధారం ఉందా ?

రాఘవరావు :— Account బుక్కు చూడాలి.

బ్యారిస్టర్ :—In this case your honour I request that the Bank Manager should be cited as one of the witnesses. The account books should also be brought.

ప. ప్రా :— Your honour in this stage అది ఎఖ్యమా యని కోర్టువారు ఆలోచించ ప్రార్థించుచున్నాను.

మేజిస్ట్రేటు :— నేరము మోపబడిన వాడికి అన్ని వసతు-
ఇవ్వ వలయునని చట్టములు చెప్పుచున్నవి.

ప. ప్రా :— Yes, your honour. It is left to your honour's discretion.

మేజిస్ట్రేటు :— I will issue summons to the Bank Manager to be brought to the Court.

బ్యారిష్టరు:— ఈ5000 రూపాయలు ఎక్కడినుండివచ్చిం మీరేచెప్పగలరా ? లేక అక్కౌంటు పుస్తకంలో ఉందా ?

రాఘవరావు :— అక్కౌంటుపుస్తకంలో లేదు.

బ్యారిష్టరు :— That will do your honour.

మేజిస్ట్రేట్ :— Next, Sub Inspector.

బ్యారిష్టరు:— మీరేనండి C 3 పోలీసు సబ్ ఇనస్పెక్ట

మేజి : అందులో సందేహమా ?

బ్యారి :— No. Your honour, this is the pr tice adopting at Courts of London and Privv Council.

మేజి :— ఉండచ్చునేమో నాకేం తెలును ! మీరుత్వరగా ముగించండి. Don't waste time.

బ్యారిష్టరు:— Yes. Your honour రాఘవరావు మీ- కంప్లెయింటు యిచ్చిన వెంటనే మీరు రత్నం ఇంట- వెళ్ళారు కాదూ ?

సబ్ :— వెంటనేవెళ్ళితిని.

బ్యారి :— ఏమైన sieze చేశారా ?

సబ్-ఇ :— Cash కనబడలేదు. అయితే ఇంకెవరివద్ద నైనను యిచ్చి పంపినారేమో నని doubt పై అరెస్టు చేశాను.

బ్యారిస్టరు :— Oh I see- అయితే మీరు cash ను seize చేయుటకు ప్రయత్నించా రన్నమాట ?

సబ్-ఇ :— ప్రయత్నం చేసినాను - investgate చేశాను - అయితే cash దొరక లేదు. అందువల్లనే రెండు శిక్షను లుగా కేసు వేసింది.

బ్యారిస్టరు :— ఎందుకూ ఏదైన ఒక శిక్షను వేయకూడదు.

మేజిస్ట్రేట్ :— Common what more ?

బ్యారిస్టర్ :— That's all your honour.

(సబ్. ఇ. యున్ను - వ. ప్రా. యున్ను గుసగుసలు మాట్లాడు కుందురు)

మేజిస్ట్రేట్ :—(బ్యారిస్టరుతో) ఏవండిసార్, బ్యాంకు మానే జరు సాక్ష్యం at this state పని లేదనుకొంటా ?

బ్యారిస్టరు :— Why - విచారించియే తీరాలి.

మేజిస్ట్రేటు :— పని లేదనుకొంటా?

బ్యారిస్టరు :—కావాలంటే చూపిస్తా- విచారించే తీరాలి.

మేజిస్ట్రేటు :—I think it is unnecessary if you press it I have no objection.

చంద్రు:—(బ్యారిస్టరుతో సన్నని గొంతుతో) పనిలేదండీ.

బ్యారిస్టర్ :— Yes, your honour, argument too is not necessary.

మేజిస్ట్రేటు :—(వ. ప్రా. తో) మీరు ఆర్గ్యుమెంటు చేస్తారా If you go further into the case the complainant himself will have to meet the consequences.

వ. ప్రా :— (సబ్-ఇతో సన్నని గొంతులో) ఈలాటి కేసులంతా ఎందుకయ్యా - నానెత్తిపై రుద్దుతావు ?

స. ఇ :—నేను నమ్మినానుసార్ !

వ. ప్రా :— ఏడ్చినట్లుంది నీవునమ్మింది ?

మేజి :—Have you dicided ?

వ. ప్రా :—Yes, your honour.

మేజి :—How ?

వ. ప్రా :—Neither to argue nor to go on with the care further your honour !

బ్యారి:—రాఘవరావుగారు మీావద్దనుండి అపహరింపబడిన 5000 రూపాయలు ఎచ్చటనుండి వచ్చినవో కూడ మీాకు జ్ఞాపకములేదు. మీా కనుదినము వచ్చెడి ఆదాయము ప్రకారము పైకమును రత్నం బ్యాంకునకు పంపియే యుండగా, అమాంతముగా ఇంతపైకము అధికముగ మీాకెలావచ్చినదో రత్నం ఆ కల్పనాధనాన్ని అపహరించడానికి ఎలా వీలుకలిగిందో దేవునికే తెలియాలి - మీారు కేసుపెట్టడానికి పూర్వము మీారు రత్నం ఇంటికి అతడు లేనప్పుడు వెళ్లారా ? లేదా నిజంచెప్పండి. ఇందులకు సాక్షులున్నారు - తప్పించుకొ దాగిలేదు.

రాఘు :— (మూతి తెల్లబోవ వెర్రిచూపులు చూచుచు) అవును, వెళ్లాను.

బ్యారి:—మీరు వెళ్ళి రత్నంగారిభార్యను బాధించడం, పతివ్రతాశిరోమణియగు యామె పిల్లకపోవడము - మీరు ప్రతీకారముచేయుటకు, ప్రతినబూనడము మొదలగు విషయములు పైన మేడలోనుండిన ఒక పెద్ద మనిషి ఆలకించుతూనే ఉండినాడు. వారిని పిలిపించి విచారణచేయుట నీకిష్టమైతే......

మేజి :— ఓ అదియూ సమాచారము. You heart-less fellow. బ్యారిష్టరు చెప్పినదంతయు నిజమా, అబద్ధమా?

రాఘు :— క్షమించాలి (అని గడ గడ వణుకుచూ మౌనముగ నుండును.)

మేజి :— ప్రాసిక్యూషన్ సైడ్, కేసును రుజువు చేయక పోవడముచేతను, రాఘవరావే దుర్మార్గుడై రత్నంపై నేరము మోపినందు చేతను, రత్నాన్ని, విడుదలచేయుచూ, రత్నం రాఘవరావుపై కోర్టుద్వారా చర్యతీసుకొనుటకు హక్కున్నట్లు ఆర్డర్ చేశాను.

(అందరూ బయటికి వత్తురు.)

రత్నం :— రాఘవరావు దుర్మార్గుడే కావచ్చు. నేను కష్టదశలో నున్నప్పుడు నాకుద్యోగమిచ్చిన పుణ్యాత్ముడు —

—

నాదుష్కాలమహిమచే ఆతనికీదుర్బుద్ధిపుట్టినది. కావున అతనిపై నేనేమీ చర్యతీసుకోను.

రాఘు :— (పరుగిడివచ్చి రత్నంకాళ్లపై బడి) క్షమింపుము రత్నం, తెలియకతప్పుచేసితిని.

# 31 వ రం గ ము

(మణలూరు గ్రామాధికారియిల్లు – రత్నం – కాంచన – వివాహం జరుగును). (మంగళ వాద్యములతో వధూవరులు మాలలు మార్చుకొందురు).

మల్లికార్జునయ్య (కాంగ్రెసులీడరు) :— మహాజనులారా! ఈవివాహసందర్భమున కొన్ని మాటలు చెప్పదలుచుకున్నాను. ఈవివాహము సాంఘిక వివాహము (Inter caste marriage) ఇలాంటి వివాహములు మనదేశంలో పెంపొంది కుల భేదము అను పిశాచమును నిర్మూలంచేసి శాశ్వత ఐకమత్యమును పెంపొందింపవలయునని గాంధీగారుసహితము ఎంతో ప్రయాసపడిరి. మనమాతృదేశ సేవలో మనము పాటించవలసిన విషయములలో యిది ఒకటి. యిట్టి సంధానముల వలన India is a single nation అనుపేరు సార్థక మగునట్లు చేయనగును.

ఇలాంటి ఒకదారిని మనకు చూపిన శ్రీ రత్నం, బి. ఏ. గారికి మనమేకాదు, మన హిందూజాతి అంతయు కృతజ్ఞులై యుండాలి. రత్నంవంటి దేశసేవకులే మనకు ప్రస్తుతం కావాలి. స్వరాజ్యం కావాలని కోరాము. చేకూరినది. అయితే యిక మీద మనం చేయవలసినదేమి? నిర్వహించవలసినదేమి?

మన దేశీయులు తమ సంపూర్ణవిశ్వాసం, ప్రేమ కాంగ్రెసు పైననే సంపూర్తిగ నుంచవలెను. గాంధిటోపీలు, ఖద్దరు దుస్తులు మాత్రం ధరించి బూటకపు బురఖాలతో తమ సహజ దుర్మార్గాన్ని, దౌష్ట్యాన్ని పెంపొందింపజేసిన, దేశసేవ జేసిన వారము కానేరము.

చాలమంది మహాత్మగాంధి భారత జాతీయ కాంగ్రెసు పేరును చాటుచేసుకొని, ప్రజల్ని అధోగతిలోనికి తెచ్చు చున్నారు.

కావున భారతీయుడుగా పుట్టిన ప్రతిమానవుడును, గాంధీ గారి సిద్ధాంతమే నిజంగా అవలంబించిన ప్రతిమానవుడును, కాంగ్రెసులోచేరి కులభేదములు పాటింపక దేశసేవచేయ సంకల్పించిన, అదే దేశమోక్షమునకు మార్గము. కులతత్వ రాక్షసిని కాలదన్ని ఐకమత్యదేవతను ఆహ్వానించి, మద్యపాన షేధచట్టమునకు దోహదముగావించి, సాంఘిక వివాహముల పెంపొందజేసి, పవిత్రభారతపితయగు శ్రీగాంధీగారి ఆత్మకు శాంతి యొసంగుదురుగావుత.

( సుందరమ్మ, కాంచనా ఒకరినొకరు కౌగలించుకొందురు. )
( కాంచన అత్తమామల పాదములకు నమస్కరించును. )

వెంకట్రావు, లక్ష్మి (ఆనంద బాష్పముల విడుచుచు) విధి విధానము తప్పింప నెవరితరము — ఆ సర్వేశ్వరుడు చిరాయు రారోగ్య సంపదలిచ్చి మిమ్ము కాపాడుగావుత !!!

( అని దీవింతురు. )

" జై హింద్ "

సర్వేజనాః సుఖినోభవంతు.

---

| పేజి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 11 | ఏలనన ... | ... ఏలన |
| 6 | యవ్వనమంతా | ... యౌవనమంతా |
| 23 | పదేనుఏండ్లు ... | ... పదునేనుఏండ్లు |
| 29 | లోకఅనుభవం | ... లోకానుభవం |
| 30 | కడుపార్థం ... | ... కడుపాత్రం |
| 43 | అగౌవర ... | ... అగౌరవ |
| 49 | (అ వైపుచూద్దురు) | ... అ వైపు చూచెదరు |
| 53 | నీకెప్పడినుండి | ... నీకెప్పటినుండి |
| Do. | ఎర్పాటుచేసేరో | ... ఏర్పాటుచేసారో |
| 55 | యెన్నియో ... | ... ఎన్నో |
| 76 | Caste ... | ... Cost |
| 78 | యవ్వనము ... | ... యౌవనము |
| 97 | కళింజాలు ... | ... కళజాలు |
| 107 | Bruit ... | ... Brute |
| 139—8 వ. | వాక్యమున, | సుం, తప్పు — చం. ఒప్పు |
| Do. | పుట్టినింటో ... | ... పుట్టినింట్లో |
| 144 | Prohebition | ... Prohibition |
| Do. | Accussed | ... Accused |
| 145 | Complaint | ... Complainant |
| Do. | Alright ... | ... Alright |
| 1[illegible] | యున్నప్పుడు ... | ... నున్నప్పుడు |
| 150 | Sieze ... | ... Seize |
| Do | Adopting ... | ... Adopted |
| 158 | Investgate | ... Investigate |
| Do. | State ... | ... Stage |
| [illegible] | Dicided ... | ... Decided |
| [illegible]o. | Care ... | ... Case |

| పేజి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- |
| 154 | యిది ... ... | ఇది |
| 57 | మొఖము ... ... | ముఖము |
| 60 | విడస్తానా ... ... | విడుస్తానా |
| 65 | (చంద్రూఅంటూ బయటికెళ్ళును) | (చంద్రు బయటికెళ్ళును) |
| 66 | తుదను ... ... | తుదకు |
| 67 | ఏమో ... ... | ఏమీ |
| 74 | అందుకున్న ... ... | ఎందుకున్న |
| 77 | ప్రేమదేవుని సృష్టిలోవుంటుంది | చం :— ప్రేమదేవుని సృష్టిలో ఉంటుంది |
| 79 | యుంటుండి ... ... | యుంటుంది |
| 149 | In this stage ... ... | At this stage |
| 148 | Allright ... ... | Alright |
| 147 | Proceedure ... ... | Procedure |
| 143 | Allright ... ... | Alright |
| 140 | నాకన్నకడుపు కాల ... | నాకన్నకడుపు కాలు [illegible] |
| 135 | 4—1—50 ... ... | 29—9—49 |
| 126 | 3-వ వాక్యము-మే :— ... | బ్రహ్మయ్య |
| [illegible]19 | చూ—చ— ... ... | సు—స—తో |
| 90 | 1—1—50 ... ... | 5—6—49 |
| [illegible] | క్షేమముగా యున్నాము ... | క్షేమముగానున్నాము |
| [illegible] | ఆతురతో [illegible] ... | ఆతురతోనున్నాము |
| 73 | I [illegible] me-[illegible] | I am made of different mettl |
| 26 | Go[illegible] | God |
| [illegible] | [illegible] | Haste |